S 3

# సృజన

ఆధునిక సాహిత్యవేదిక
మాసపత్రిక

జన్మదిన సంచిక



# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

జన్మదిన సంచిక

29

ఫిబ్రవరి 1972

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

100 పేజీలు 1 రూపాయి

ముఖచిత్రం:

పిఎల్ 480

మనోహన్‌దత్

ప్రతులకు, వివరాలకు:

4/729 కుమార్‌పల్లి

హనుమకొండ

వరంగల్-1 (ఆం. ప్ర.)

సంవత్సరచందా: పదిరూపాయలు

అర్ధసంవత్సరచందా: ఆరు రూపాయలు

విడిప్రతి: ఒకరూపాయి

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.)

## పి. ఎల్. 480

నయవంచనకు మారుపేరు. తడిగుడ్డతో గొంతు కోయటానికి దృష్టాంతం. చాపకిందనీళ్లు. ఇంపీరియలిజానికి నిజానికి గొడుగు. అది పబ్లిక్‌లా ఫోరెయిటీ.

బ్రిటిష్ సామ్రాజ్యపాలకుల చేతుల్నించి భారతదేశం బయట పడేసరికి అస్థిపంజరమే మిగిలింది. దానిపైవాలింది సామ్రాజ్యవాదపు గరుడపక్షి. మూలుగులు పీల్చేయటానికి.

మనోహన్‌దత్ కాన్వాస్‌లపై ప్రధానంగా వాడేరంగులు నీలం, ఎరుపు. పెయింటింగ్ పి. ఎల్. 480 లో కిందిభాగం అస్థిపంజరం భారతదేశానికి గుర్తు. ఆపైన వాలింది ఈగిల్. నీలం ఎరుపు చారల్లో తెల్లటి చుక్కల్తో సంయుక్త రాష్ట్రాల పతాకం రంగుల్లో ఉన్న ఈగిల్ రెక్కలు అమెరికాకు సంకేతం. సుమారు నాలుకేళ్లక్రితం ఈ పెయింటింగ్ పూర్తి చేసాడు. నాలుగేళ్లతర్వాత భారత ప్రభుత్వం ఫి. ఎల్. ప్రొమాదాన్ని బాహాటంగా తన ప్రయోజనంకోసం ప్రకటించింది.

దేశక్షేమాన్ని అర్థంచేసుకోవడంలో ప్రగతివాదులయిన కళాకారులు ఎంతముందున్నదీ ఈ కాన్వాస్ చెప్తుంది.

చిత్రకారుల్లో సామాజిక స్పృహ అన్నది బాధ్యతాయుతమైనదీ, నిర్మాణాత్మకమైనదీ కావాలి. ఆ స్పృహే కళలకు గీటురాయి.

# కళావేత్తలారా! మీరే వైపు?

మాగ్జిం గోర్కీ

(గోర్కీ 1932 లో ఒక అమెరికా విలేఖరికి ఇచ్చిన సమాధానం)

"ఎక్కడో మహాసముద్రానికి అవతల సుదూరంగా ఉన్న ప్రజలనుంచి వచ్చిన ఈజాబు బహుశా మీకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించి ఉంటుంది." అని మీరు వ్రాశారు. కాని నాకు మీ ఉత్తరం ఎలాంటి ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఇలాంటి ఉత్తరాలు తరుచుగా నా కెప్పుడూ వస్తూనే ఉంటాయి. మీ ఉత్తరంలో ఏదో 'ప్రత్యేకత' ఉందని మీరు పొరపడుతున్నారు. కాని గత రెండు మూడు సంవత్సరాల నుంచి బుద్ధిజీవి (మేధావి) వర్గం ఇలాంటి హెచ్చరికలు, విజ్ఞప్తులు చేయడం నిత్యకృత్యమై పోయింది. ఔను. ఇది సహజమే. బూర్జువావర్గ నిజస్వరూపం బట్టబయలు కాకుండా లోపాలను కప్పిపుచ్చి పైపై మెరుగులతో ఆకర్షణీయంగా దాన్ని అలంకరించడం బూర్జువావర్గ జీవితానికి సంబంధించిన చిన్న చిన్న ఇబ్బందులపట్ల హృదయపూర్వక సంతాప సానుభూతులు ప్రకటించడం, వారిని ఓదార్చడం– ఇదే బుద్ధిజీవివర్గం ఎల్లప్పుడూ ముఖ్యంగా చేస్తోన్నపని. అసలు బూర్జువావర్గాన్ని పెంచి పోషించినది బుద్ధిజీవివర్గమే. బూర్జువా వర్గం వేసుకొనే తత్వశాస్త్రం- మతశాస్త్రం– ముసుగు పాతబడి, చినిగిపోయి. శ్రమజీవుల చిక్కని రక్తంతో తడిసి ముద్దఅయింది. ఆ చినిగిపోయిన ముసుగులోని చినుగులు కనబడకుండా తెల్లటి మాసికలువేసి కుట్టడంలో మేధావివర్గం ఊపిరి సల్పకుండా పనిచేసింది. మేధావివర్గం పాపం! ఎన్ని అవస్థలుపడినా ఈ పనిని జయప్రదంగా సాగించలేక పోయింది. ముందు రానున్న పరిస్థితుల స్వరూపం ఎలా ఉంటుందో కండ్లకు కట్టినట్లు స్పష్టంగా ప్రత్యక్షంగా కనిపిస్తున్నా, వారు ఇంకా తమ విఫల ప్రయత్నం కొనసాగిస్తూనే ఉన్నా[illegible] ఉదాహ[illegible]ణకు ఈ క్రింది విషయాన్నే తీసుకోండి: చైనాను సామ్రాజ్యవాదులు తమలో తాము పంచుకోబోయేముందు స్పెంగ్లెర్ అనే ఒక జర్మన్ "రంగు జాతులకు" టెక్నికల్ విజ్ఞానాన్ని గరపి 19వ శతాబ్దంలో యూరోపియన్లు గొప్ప తప్పుచేశారు." అని "మానవుడూ టెక్నిక్" అనే తనపుస్తకంలో వ్రాశాడు. స్పెంగ్లెర్ వ్రాతలను హెండ్రిక్ వాన్ లూన్ అనే మీ అమెరికా చరిత్రకారుడు బలపర్చాడు

19వ శతాబ్దంలో చేసిన ఈలోపాన్ని నేడు దిద్దుకోవాలని మీవాళ్లు ఆరాటపడుతున్నారు యూరప్‌లోని పెట్టుబడిదారులూ, అమెరికాలోని పెట్టుబడిదార్లూ అటు

జపానుకూ ఇటు చైనాకూ డబ్బుతోపాటు ఆయుధసామగ్రికూడా అందజేస్తున్నారు చైనా జపాన్ దేశాలు రెండూ పరస్పరం పోరాడి ఒకదానిని మరొకటి నాశనం చేసుకోడమే వాళ్ళకు కావలసింది. అంతగా అవసరమైతే జపాన్ సామ్రాజ్యవాదుల ముఖాన ఒక పిడిగ్రుద్దువేసి లొంగదీసుకోడానికి కూడా తమ నౌకాబలాన్ని తూర్పుదిశకు తరలిస్తున్నారు. ఎలుగుగొడ్డు చావడంతోనే దానిగుహను తమలోతాము పంచుకుంటూ 'ధైర్యశాలి' అయిన కుందేలు (జపాను)కు కూడా దానివంతు దానికిస్తారు. అసలు ఎలుగుగొడ్డును చంపడమే జరగదని (చైనాను సామ్రాజ్యవాదులు జయించడం అసంభవం అని) నా వ్యక్తిగతాభిప్రాయం. యూరోపియన్ సంస్కృతికీ, అమెరికన్ సంస్కృతికీ ఒక పెద్ద ప్రమాదం వచ్చిపడిందని బాకాలూదే స్పెంగ్లెర్, వాన్‌లూన్ లాంటి బూర్జువా ఏజెంట్లు హిందువులూ (భారతీయులని గోర్కీ భావం) జపానీయులూ, చైనీయులూ, నీగ్రోలూ వీరంతా ఒకే ఒకవర్గానికి చెందినవారు కాదనీ, వీరిలో వివిధవర్గాలున్నాయనే అసలు విషయాన్ని మాత్రం మరచిపోతున్నారు. యితరుల కాయకష్టంచే పెట్టుబడిదారులు తమ బొర్రలు నింపుకొనే విషపూరిత స్వార్థసిద్ధాంతానికి సరియైన విరుగుడు (మార్క్సిజం లెనినిజం) కనిపెట్టబడిందనీ, అది చక్కగా అమోఘంగా పనిజేస్తూ ఉందనీ వాళ్ళు మరచిపోయారు. నిజానికి వారు మరచిపోకపోయినా మరచిపోయినట్లే పైకి నటిస్తున్నారు స్వార్థసిద్ధికోసమే వాళ్ళీదొంగనటన సాగిస్తున్నారు 'యూరోపియన్ సంస్కృతికి ప్రమాదం వచ్చిపడింది' అని గొంతు చించుకుంటూ వాళ్ళుచేసే నినాదాన్ని బట్టే విషం ఎంత విస్తారమైనదో దానివిరుగుడు ఎంత తిరుగులేనిదో వాళ్ళకు బాగా తెలుసు.

'సంస్కృతి పాడైపోయిందో' అని ఏడ్చేవాళ్ళ సంఖ్య రోజు రోజుకూ పెరిగిపోతూవుంది. రోజురోజుకూ వాళ్ల ఇంకా బిగ్గరగా కేకలూ రంకెలూ వేస్తున్నారు ఫ్రెంచి మాజీ మంత్రివర్గసభ్యుడు కెయిలాక్స్ తమ సంస్కృతికి నిలకడలేకుండా పోయిందని మూడుమాసాల క్రితం గొంతు చించుకుంటూ ఈవిధంగా గొడవబెట్టాడు.

"ప్రపంచమంతా నేడు పరస్పర అవిశ్వాసంతో నిండిపోయి విషాదాత్మకంగా పరిణమించింది ఒకవైపు తిండిలేక లక్షలకొలది ప్రజలు అలమటిస్తూఉంటే మరోవైపు పుట్లకు పుట్లు గోధుమలను వంటచెరుకుగా ఉపయోగించడం, బస్తాలకు బస్తాల కాఫీ గింజలను సముద్రంపాలు చేయడం నిజంగా విచారించదగిన విషయం కాదా ?

మనలో మనకు పరస్పరవిశ్వాసం లేకపోవడం ఇప్పటికే చాలాచెరుపు కలిగించింది. యుద్ధాలను రెచ్చగొట్టింది. శాంతి ఒడంబడికలకు అంగీకరించేటట్లు చేసింది. మనలోమనం ఇప్పటికైనా పరస్పర విశ్వాసం నెలకొల్పుకోలేకపోతే మన నాగరికత

యావత్తూ మంటగలిసిపోతుంది. ఈ విషమపరిస్థితి కంతటికీ కారణం నేటి ఆర్థిక విధానమే అని వాదించేవాళ్ళకు అసలు ఈ ఆర్థికవిధాన పునాదులనే కూలద్రోయడానికి మంచి అవకాశం లభిస్తుంది."

ఈనాడు ఒకళ్లకొకళ్లకు పోటీపడి ప్రజలను పీక్కుతినే రాబందుల్లో - దోపిడి గాండ్లల్లో - పరస్పర విశ్వాసం ఉండాలని చెప్పేవాళ్ళు వట్టి మోసగాండ్లు అయినా అయిఉండాలి; లేక శుద్ధ అజ్ఞానులైనా అయిఉండాలి.

'ప్రజలు' అనేమాటకు 'కష్టజీవులే' అనిఅర్థం అయితే ఈనాటి విషమ పరిస్థితులన్నిటికి కారణం పెట్టుబడిదారీ విధానమే అని కష్టజీవులనడంలో తప్పేంతమాత్రం లేదని చిత్తశుద్ధిగల ప్రతివాడూ అంగీకరించి తీరాలి. ప్రజలు తమ చెమటోడ్చి కష్టించినదానికి ఫలితంగా ఈపెట్టుబడిదారీ విధానం వారికిచ్చే బహుమతి ఏమిటి? బాధలు, ఆకలిమంటలు మాత్రమే. 'కమ్యూనిస్టు మానిఫెస్టో'లో మార్క్సు ఎంగిల్సులు చెప్పిన విషయాలు ఎంత పరమసత్యాలో శ్రామికవర్గం నానాటికి స్పష్టంగా చూడగలుగుతోంది.

"తనదాస్యంలో ఉన్న బానిసకుకూడా జీవనాధారం చూపలేని బూర్జువా వర్గం పరిపాలనచేయడానికి ఎంతమాత్రం తగదు. బానిసే తనకు తిండిపెట్టి తనను పోషించడానికి బదులుగా తానే (బూర్జువావర్గమే) బానిసకు తిండిపెట్టి పోషించవలసిన పరిస్థితి ఏర్పడింది. (అసలు జీవనాధారమేలేని కార్మికుడు యజమానికి ఇంకా అదనంగా సంపాదించి పెట్టడం సాధ్యంకాదు కాబట్టి. అందువల్ల ఈ పెట్టుబడిదారీ వర్గంక్రింద సమాజం ఎంతోకాలం ఉండజాలదు. ఈ బూర్జువావర్గ అస్తిత్వం సమాజంలో ఎంతోకాలం నిలవదు."

బూర్జువావర్గం అంటే పడిచచ్చే వాళ్ళల్లో కెయిలాక్సుకూడా ఒకడు. బూర్జువా అజ్ఞానాన్నే మానవజాతి చిరసంచిత మహత్తర విజ్ఞానంగా వీళ్ళు చిత్రిస్తారు. కొత్త కొత్త సిద్ధాంతాలు లేవదీస్తారు. బూర్జువా సిద్ధాంతంకంటె గొప్ప సిద్ధాంతం 'నభూతో నభవిష్యతి' అని వాదిస్తారు. ఆర్థికశాస్త్రంలో కూడా ఈ బూర్జువా ఏజెంట్లు తమ పాండిత్య ప్రకర్షను వెలగబెట్టాలని ఇటీవలదాకా ప్రయత్నించారు. బూర్జువా సిద్ధాంతం ఆచంద్రతారార్కం నిలబడే ఒక అజరామరమైన శాస్త్రీయ సిద్ధాంతమని నిరూపించేందుకు నానావస్థలు పడ్డారు.

కాని మళ్ళీవాళ్ళే ఎప్పుడూ సైన్సుకు- అసలు శాస్త్రీయసిద్ధాంతానికే - స్వస్తిచెప్పుతున్నారు పై జెప్పిన కెయిలాక్స్ ఫిబ్రవరి 23వ తేదీన పాల్‌మిల్యుకోవ్‌లాంటి మాజీ మంత్రివర్గ సభ్యుల సమక్షాన మాట్లాడుతూ స్పెంగ్లర్ సూచించిన పంథానే అనుసరించాడు :

"టెక్నిక్ అభివృద్ధి అయిన ఫలితంగా నిరుద్యోగం సర్వత్రి వ్యాపించింది. ఉద్యోగంనుంచి తొలగించిన కార్మికుల వేతనాలు యజమానుల అధికలాభాల క్రిందకు జమపచ్చాయి. 'హృదయ రహితమైన' సైన్సు మానవజాతికే హానికరం, కాబట్టి సైన్సును మానవజాతి తన అదుపులో ఉంచుకోవాలి. సైన్సుకు కళ్ళెం బెట్టాలి. నేటి విషమ పరిస్థితి - ఆర్థికమాంద్యం - మానవజాతి విజ్ఞానానికి ఒక ఓటమి లాంటిది. ఒక్కొక్క సమయంలో ఒక మహావ్యక్తికంటె సైన్సుకు గొప్ప దురదృష్టం మరేదీ లేదు. ఆ మహావ్యక్తిచేసే సిద్ధాంత ప్రతిపాదన ఆరోజుల్లో చాలా గొప్పగానే ఉంటుంది. ఉదాహరణకు కార్ల్‌మార్క్సనేతీసుకోండి। అయన సిద్ధాంతాలు 1848 లోగానీ లేక 1870 లోగానీ సరియైనవే. కాని అవి 1932 లో ఎందుకూ పనికిరానివి. ఇప్పుడు మార్క్స బ్రతికి ఉంటే ఆయన మరోవిధంగా వ్రాసి ఉండేవాడు."

బూర్జువావర్గం ఈవిధంగా చెప్పుతుందంటే ఆ వర్గం తన అజ్ఞానాన్ని బైటబెట్టుకుంటోందన్నమాట. సైన్సు అభివృద్ధిగాకుండా దానికి కళ్లెం పెట్టజూస్తోంది. శ్రామిక ప్రపంచంపై తన అధికారాన్ని జమాయించడానికి సైన్సు తనకెంతగా ఉపయోగపడిందో మరచిపోయింది. "సైన్సుకు కళ్లెం బెట్టడం" అంటే అర్థమేమిటి? సైన్సు అభివృద్ధి చెందకుండా దాన్ని నిరోధించడానికి కొత్తపద్ధతులను కనిపెట్టడమన్నమాట. సైన్సు యొక్క స్వాతంత్ర్యాన్ని అరికట్టే మతసంస్థల (చర్చి) ప్రయత్నాలనెదిరించి ఒకప్పుడీ బూర్జువావర్గమే సాహసోపేతంగా, జయప్రదంగా పోరాటం సల్పింది. కాని ఈరోజు బూర్జువాతత్వశాస్త్రం నావాటికీ దిగజారి మధ్యయుగంనాటి మెట్ట వేదాంతానికి బానిసగా తయారయింది. మార్క్స చెప్పినట్లు యూరోప్‌ఖండం మళ్ళీ అనాగరికదశకు పరిణమించే ప్రమాదం ఏర్పడింది అని కెయిలాక్స్ చెప్పాడు. కాని మార్క్సిస్టు సిద్ధాంతాలను గురించి ఈ పెద్దమనిషికి తెలిసిందేమీ లేదు

యూరప్‌ఖండంలోని బూర్జువావర్గమూ, ప్రస్తుతం ప్రపంచాధికారిగా ఉన్న అమెరికా బూర్జువావర్గమూ రోజు రోజుకూ అజ్ఞానాంధకారంలో పడి అనాగరికంగా తయారవుతూ ఉంది అనడం నిర్వివాదాంశం. ఇందుకు కెయిలాక్స్ చక్కని ఉదాహరణం.

'మళ్ళీ అనాగరికదశకు పోవడం' అనే భావం ఆధునిక బూర్జువావర్గంలో ఒక 'ఫేషన్'గా మారింది. స్పెంగ్లెర్లూ కెయిలాక్సులూ - ఈబాపతు ఆలోచనాపరులంతా- ఇలాంటి అనాగరిక భావాలనే ప్రతిబింబిస్తున్నారు. తమ వర్గానికి ప్రమాదం వచ్చిపడిం దని ఆందోళన చెందుతున్నారు. ప్రపంచ కార్మికప్రజల్లో ఉవ్వెత్తుగా ఉప్పొంగుతున్న విప్లవ చైతన్యాన్ని చూచి వీరికి మతిపోతూ ఉంది. కార్మికవర్గంలో సాంస్కృతిక విప్లవాభి వృద్ధి జరుగుతూవుందనే విషయాన్ని వారు విశ్వసించరు. దాన్నిగురించి తెలుసుకో డానికికూడా ప్రయత్నించరు. ప్రపంచంలో ఏమూలజూచినా ఇదే నేడు ప్రత్యక్షం అవుతూ వుంది.

మానవజాతి గడించిన అనుభవం అంతా దీన్నే రుజువుచేస్తూ వుంది. ఈపరి ణామం అనివార్యంగా జరిగితీరుతుంది. బూర్జువా చరిత్రకారులుకూడా దీన్నికొంతవరకు అంగీకరించక తప్పలేదు. అయితే 'చరిత్రి' కూడా ఒక సైన్సే కాబట్టి దానికికూడా 'కళ్ళెం' పెట్టవలసి వస్తుందేమో! చరిత్రి యొక్క అస్తిత్వాన్నే మరచిపోవలసి వస్తుందేమో! లేక దాన్ని నిర్లక్ష్యం చేయవలసి వుంటుందేమో! "రివ్యూ ఆఫ్ మోడరన్ టైమ్సు"లో పాల్‌వాలెరీ అనే ఫ్రెంచి పండితుడు చరిత్రిను మరచిపొమ్మని బాహాటంగానే సలహా యిస్తున్నాడు. చరిత్రియే ఈనాటి దౌర్భాగ్య పరిస్థితులన్నింటికీ కారణం అంటున్నాడు. గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకోడంవల్ల మానవులు అందని కోర్కెలకు అర్రులు జాస్తారట! "మానవులు" అని ఆయన వాడినమాటకు 'బూర్జువావర్గం' అని మనం అర్థం చేసుకుంటే సరిపోతుంది. అతనికంటిలో పెట్టుబడిదారులు తప్ప మరెవ్వరూ 'మానవులు' కారు. బూర్జువావర్గం ఇటీవలదాకా చరిత్రిను తన అభిమానవిషయంగా పరిగణించేది. చరిత్ర వ్రాయడంలో బూర్జువావర్గం ఎంతో నేర్పును చూపింది. కాని ఇప్పుడా చరిత్రనుగురించే పాల్‌వాలెరీ ఈవిధంగా వ్రాస్తున్నాడు:

"మనమేధస్సు అనే రసాయన పరిశోధనశాలలో ఉత్పత్తి అయిన అన్నివస్తు వులకంటె చరిత్ర మహాప్రమాదకరమైనది. చరిత్ర ఊహాగానాన్ని ఎక్కువచేస్తుంది. అనేక ఆశలు కలిగిస్తుంది జాతులపై మత్తుమందు చల్లుతుంది భ్రమలు కల్పిస్తుంది. గత విషయాలను స్మృతికితెచ్చి గోరంతలు కొండంతలుగా చిత్రిస్తుంది. పాతగాయా లను కెలికి మనస్సుకు శాంతిలేకుండా చేస్తుంది. గొంతెమ్మ కోరికలను సాధించడం కోసం ఆరాటపెడుతుంది."

ఇదంతా విముక్తిని సాధించడంకోసమే అని ఆయన చెప్పుతున్నాడు. బూర్జువా వర్గం ప్రశాంతంగా కాలం గడుపుకోవాలని చూస్తూఉంది అనేవిషయం అతనికితెలుసు. బూర్జువావర్గం నిరభ్యంతరంగా తన దోపిడి కొనసాగించడానికి లక్షలకొలది మానవ

జీవులను బలిపెట్టడం న్యాయసంగతమే అని భావిస్తుంది. తన స్వార్థంకోసం, తనసుఖం కోసం కోట్లకొలది గ్రంథాలను అగ్నికాహుతి చేయడంకూడా ఒక పుణ్యకార్యమే అనుకుంటుంది.

ఈ ప్రశాంత జీవితం సాఫీగా సాగిపోకుండా మధ్య మధ్యన చరిత్ర జోక్యం కలిగించుకుంటుంది. కాబట్టి వారిదృష్టిలో చరిత్రనాశనం కావాలి. పాఠ్యక్రమం నుంచి చరిత్ర గ్రంథాలను బహిష్కరించాలి. గత చరిత్ర నధ్యయనం చేయడం ప్రమాదకరమనీ. అపరాధమనీ, ప్రభుత్వం ప్రకటించాలి చరిత్ర నభ్యసించేవారిని ఉన్మాదులుగా భావించి వారిని మానవనివాస యోగ్యంకాని దీవులకు దిగుమతిచేయాలి.

బూర్జువా ఏజెంట్ల బుర్రలు ఏవిధంగా పనిచేస్తున్నాయో దీనినిబట్టి స్పష్టంగా తెలుసుకోవచ్చు. కాని కెయిలాక్స్ సిద్ధాంతం ప్రకారం జాతీయపెట్టుబడిదారీ ముఠాల్లో పరస్పర విశ్వాసం నెలకొనడం ముఖ్యావసరం. దూరంగా ఉన్న ఏదో ఒకదేశం–ఉదాహరణకు చైనా–ను యూరోప్ దుకాణదార్ల దోపిడికి స్వేచ్ఛగా వదిలిపెట్టాలి. అయితే జపాన్ దుకాణదార్లు చైనాలో తాము తప్ప ఇతరులెవరూ ప్రవేశించరాదని తలుపులు మూసివేస్తున్నారు యూరోప్‌కంటె చైనా తనకు చాలాదగ్గరగా ఉంది కాబట్టి చైనాపై తమదే హక్కని జపాన్ వ్యాపారస్తులు వాదిస్తున్నారు. హిందువులను (భారతీయులు అనే అర్థంలో ఇక్కడ హిందువులు అనేమాట ప్రయోగించబడింది) దోపిడిచేయడం ఇంగ్లీషు పెద్దలకు అలవాటు ఐపోయింది. కాబట్టి హిందువులను దోపిడిచేయడంకంటె చైనాను దోపిడిచేయడం జపాను వ్యాపారస్థులకు ఎక్కువ తేలికైన పని. ఈ దోపిడీ ఫలితంగా ఏ ఏడే పోటీలు ప్రపంచాన్ని మరో మారణ హోమంలోకి ఈడుస్తాయి. గ్రెంగోయిరీ అనే ప్యారిస్ పత్రికా విలేఖరిమాటలలో "తనకు సాధారణంగా ఉపయోగపడే పెద్దమార్కెట్టు అయిన రష్యా సామ్రాజ్యాన్ని యూరోపు కోల్పోయింది ఇదే ఈనాటి చెడుపరిస్థితులన్నిటికి మూలకారణం." దీనికి పరిష్కారమార్గంగా తదితర విలేఖరులూ, రాజకీయ నాయకులూ, బిషప్పులూ, పెట్టుబడివారులూ, యుద్ధోన్మాదుల్లాగే గ్రెంగోయిరీకూడా యూరోప్‌ఖండం అంతాకలిసి సోవియట్ యూనియన్‌లో జోక్యం కలిగించుకోవాలని చెప్పుతున్నాడు. యూరప్‌లో నిరుద్యోగ సమస్య రోజు రోజుకూ తీవ్రమవుతూ ఉంది. దీనితోపాటు శ్రామికుల్లో వర్గ చైతన్యంకూడా దినదిన ప్రవర్ధమానమవుతూ ఉంది శాంతి స్థాపనకు చాలా తక్కువ అవకాశాలు కనిపిస్తున్నాయి అసలు శాంతికి స్థానంలేదా అనికూడా అప్పుడప్పుడనిపిస్తుంది. నేను అత్యాశావాదిని కాదు. ప్రజావిరోధి అయిన బూర్జువావర్గం తన దురాక్రమణ ప్లానుల నెప్పుడూ కొనసాగిస్తూనే ఉంటుందనే విషయం నేనెరుగుదును జాతీయ దురహంకారి అయిన బర్గర్ (కలోన్) ఫిబ్రవరి 19వ తేదీన ఇలా అన్నాడు.

"హిట్లరు అధికారంలోకి వచ్చిన తర్వాత జర్మనీ భూభాగాన్ని ఆక్రమించు కోడానికి ఫ్రెంచి అధికారులు ప్రయత్నిస్తే మేము యూదులనందరినీ సర్వనాశనం చేసివేస్తాం."

ఈ విధంగా ప్రకటించినందుకు ఇకముందు బహిరంగసభల్లో మాట్లాడరాదని ప్రష్యన్ ప్రభుత్వం బర్గర్‌పై నిషేధాజ్ఞ జారీచేసింది. ఈ నిషేధాజ్ఞ హిట్లరు అనుయాయుల క్రోధాన్ని మరింత రెచ్చగొట్టింది. ఒక 'జాతీయ' (రేసిస్టు) పత్రిక ఇలా వ్రాసింది.

"శాస్త్ర విరుద్ధమైన చర్యకు ప్రోత్సహించే నేరమేమీ బర్గర్ చేయలేదు. ప్రభుత్వాధికారం మా చేతిలోకి వచ్చినతర్వాత మేముచేసే నూతన చట్టంప్రకారమే యూదులను హతమార్చివేస్తాం."

ఈ ప్రకటనను ఒక ఎగతాళిగా, ఒక తమాషాగా మనం భావించగూడదు. యూరోపియన్ బూర్జువావర్గం ప్రస్తుత మున్నదశలో అలాంటి చట్టాన్ని ప్యాసుచేయడంలోగానీ, యూదు జాతినంతటినీ నాశనం చేయడమేకాకుండా తమ అభిప్రాయాలతో ఏకీభవించని వారినందరినీ- మొదటివరుసలో తమ ప్రయోజనాల కనుకూలంగా పనిచేయని వారినందరినీ- నాశనం చేయడంలోగాని ఎట్టి ఆశ్చర్యంలేదు.

* * *

బుద్ధిజీవివర్గంలో ఈ 'విషచక్రానికి' చెందిన బూర్జువా సమర్థకులు బూర్జువా వర్గాన్ని సమర్థించడంలో క్రిమక్రమంగా తమ నేర్పును కోల్పోతున్నారు, ఆ సమర్థకులనే మరికొందరు సమర్థించవలసి వస్తూవుంది. వారు తమకాళ్ళమీద తాము నుంచోలేకపోతున్నారు. సిద్ధాంతరీత్యా తమను వ్యతిరేకించేవారి నుంచికూడా (బూర్జువావర్గాధికారం ఏర్పడుతుందనే భయంతో) వీరు సహాయం పొందడానికి ఆరాటపడుతున్నారు. వీరు చేయగలిగిన ఘనకార్యం దుష్ప్రచారం - అబద్ధాల ప్రచారం - మాత్రమే. ఎన్ని అబద్ధాలాడినా వాస్తవిక బూర్జువావికృత స్వరూపాన్ని వీరు కప్పిపుచ్చలేక పోతున్నారు. ప్రపంచాన్ని దోపిడిచేసి అలసిపోయిన వాళ్ళనూ, తమదోపిడి ప్రణాళిక ఫలితంగా నానాటికి తీవ్రతరమవుతూన్న శ్రామికవర్గ ప్రతిఘటనతో వ్యాకులపడేవాళ్ళనూ, అంతులేని లాభాలు సంపాదించాలనే దురాశతో ఉన్మత్తభీషణ రూపందాల్చి సంఘవినాశనకారులుగా తయారైనవాళ్ళనూ, బలపరచడం, లేక కాపాడడం కేవలం నిరర్థకమే కాకుండా ఆ బలపరచేవాళ్ళకు కూడా అది ముప్పుతెచ్చి పెడుతుంది,

ప్రజల కుత్తుకలు కత్తిరించే దోపిడిదొంగలైన పెట్టుబడిదారులను ఓదార్చడమంటే బలపరచడమంటే- ఎంత అపరాధమో వేరే చెప్పనవసరంలేదు. ఇది వాస్తవిక జీవి

తానికి దూరమైన నిరుపయోగమైన నైతికవిషయం కాబట్టి దీనినుంచి జరిగేదేమీలేదు. అయితే ఈ ఓదార్చే బుద్ధిజీవులు నేటి ప్రపంచంలో తమను ఒక 'మూఢోశక్తి'గా - మూఢోశక్తి అంటూ అసలు ఉండదని తర్కశాస్త్రం ఒకవైపు నిరూపిస్తున్నా— పరిగణించుకుంటున్నారు.

పుట్టుకరీత్యా వీరు బూర్జువా వర్గానికి చెందివున్నా సంఘంలో వీరిస్థానం కార్మికులతోపాటే ఉంటుంది. పతనమైపోతూన్న - పతనమై తీరవలసిన - వర్గానికి తాము చేసే సేవఅంతా బూడిదలో పోసిన పన్నీరులాగా ఎలా కొరగాకుండా పోతూఉందో వీరు గ్రహిస్తున్నారు. హత్యలనే దోపిడీనే వృత్తిగా పెట్టుకొన్నవారు నశించడం ఎంత అవసరమో బూర్జువావర్గం నశించడం కూడా అంతే అవసరం. ఈ బుద్ధిజీవులు చేసే సహకారంతో బూర్జువా వర్గానికి ఇక అవసరం లేకపోవడముచేత బుద్ధిజీవులుకూడా అసలు విషయాన్ని ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్నారు. మేధావులు ఇప్పటికే ఎక్కువై పొయ్యారని తమ వర్గానికిచెందిన కొందరు ఏవిధముగా బూర్జువావర్గాన్ని సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తున్నారో వీరు తెలుసుకుంటున్నారు బూర్జువావర్గంకూడా వేదాంతులనూ, తాత్వికులనూ వదలి ముందు జరగబోయే విషయాన్ని కూడా చెప్పుతాం అనే జ్యోతిష్కులను ఆశ్రయించడం వీరు గమనిస్తూనే ఉన్నారు. బూర్జువావర్గం కంటె పరమమూర్ఖులైన సాముద్రిక శాస్త్రజ్ఞులూ, దైవజ్ఞులూ జోస్యకారులూ, ఫకీర్లూ, సన్యాసులూ ఆధ్యాత్మికవాదులూ చేసే ప్రకటనలతో యూరోప్ వార్తా పత్రికలు నిండిపోతున్నాయి కెమేరాలూ (ఫొటోగ్రఫీ) సినిమాలూ, కళను హత్యచేస్తున్నాయి. ఉదర పోషణార్థం— తిండికీ, రొట్టెకూ, బంగాళాదుంపలకూ, ధనికులు కట్టివిడిచిన పాతబట్టలకూ— చిత్రకారులు తమ చిత్రాలను మారకం వేసుకుంటున్నారు. అమ్ముకుంటున్నారు.

ఒక ప్యారిస్ వార్తాపత్రికలో ప్రకటించబడిన ఈ క్రింది తమాషా వార్తను తిలకించండి.

"బెర్లిన్ చిత్రకారులు నానా దురవస్థలకు గురి అవుతున్నారు. ఆశాలేశమెక్కడా కనిపించడంలేదు చిత్రకారులు పరస్పర సహాయక సంఘాలు నిర్మించుకోబోతున్నారని వార్తలు వస్తున్నాయి. రాగిదమ్మిడీ కూడా గడించలేని- గడించడానికి అవకాశం లేని- వీరు పరస్పరం ఏవిధంగా సహాయం చేసుకోగలరు? అన్నాట్ జాకోబీ అనే చిత్రకారిణి సూచించిన వస్తువినిమయ పద్ధతికి బెర్లిన్ కళాపేక్షలూ చిత్రకారులూ ఎంతో సంతోషంగా స్వాగతం ఇస్తున్నారు. చిత్రకారులు వ్రాసిన చిత్రాలనూ శిలా విగ్రహాలనూ తీసుకొని బొగ్గు వ్యాపారులు చిత్రకారులకు కావలసిన వంట చెరుకును సప్లయి చేయవలసి ఉంటుంది. కాలము ఎప్పుడూ ఒకేవిధముగా ఉండదు. పరిస్థితులు మారుతూ

ఉంటాయి. ఈవిధంగా వస్తువులు మారకం వేసుకోవడంవల్ల బొగ్గు వ్యాపారులు నష్ట పడరు. ఒక దంతవైద్యుడు చిత్రికారులకు దంతవైద్యం చేస్తాడు. దంతవైద్యుడు తన వైద్యశాలను చిత్రాలతో అలంకరించడం అతనికి మించినపనేమీగాదు. పాలవాళ్ళు కసాయివాళ్ళు ఈ సదవకాశాన్ని చక్కగా ఉపయోగించుకుంటారు. చిత్రాలకు నగదు చెల్లించి కొనుక్కోకుండానే పాలవాళ్ళు కసాయివాళ్ళు కూడా కళాసౌందర్యాన్ని అనుభ విస్తారు. అన్నాట్ జాకోబీ సూచనను అమలుపరచడానికి బెర్లిన్‌లో ఒక ప్రత్యేక బ్యూరోను ఏర్పాటుచడానికి చురుకుగా ప్రయత్నాలు జరుగుతున్నాయి."

ఈ వస్తువినిమయ పద్ధతిని గురించి ఉల్లేఖిస్తూన్న సందర్భంలో ఇలాంటి సంఘం ఒకటి ఇదివరకే ప్యారిస్‌లో ఉందనే విషయాన్ని ఆ పత్రిక పేర్కొనకుండా జారవిడిచింది.

ఉత్తమ నాట్యకళను సినిమాలు క్రమక్రమంగా విధ్వంసంచేసివేశాయి. బూర్జువా చలనచిత్రాలుచేసే విషప్రచారాన్ని గురించి ఎక్కువగా చెప్పడం అనవసరం. యదార్థం కండ్లకు గట్టినట్లు కనిపిస్తూనే ఉంది. సనాతనభావాలకు సంబంధించిన కథావస్తువులన్నీ (సెంటిమెంటల్ థీమ్సు) అయిపోవడంతో బూర్జువాడైరెక్టర్లు ఇప్పుడు శారీరిక నగ్న దృశ్యాలపైకి ఎగబడుతున్నారు.

"మెట్రో గోల్డ్‌విన్ మేయర్ అనే హాలివుడ్ స్టూడియోలో 'ఫ్రీక్సు' అనే ఫిలిం తయారుచేయడానికి ఒక ప్రత్యేక ట్రూపు ఏర్పడింది. ఇందులో పాత్రలు: కొంగ పోలికలు గలిగిన ఒక ఆడకోయిల; పి. రాబిన్‌సన్, మానవుని అస్థిపంజరం; ఒంటి చేతితో బుట్టినమార్థా, ఈమె తన కాళ్ళతో లేసును అల్లడంలో సమర్థురాలు; ఛిల్జీ, ఈమెకు 'పిన్‌హెడ్' అని ఎగతాళిగా పెట్టినపేరు, 'పిన్‌హెడ్' అంటే తతిమాశరీరం అంతా సాధారణంగా ఉండి తలమాత్రం గుండుసూదిలాగా అతి చిన్నదిగా ఉండడం; ఓల్గా, పురుషునిలాగా పెద్దగడ్డం ఉన్న స్త్రీ: జోసెఫ్, సగం స్త్రీ, సగం పురుషుడు: సయాం కవలపిల్లలు గిల్టన్ అప్పచెల్లెళ్లు, మరికొందరు మరుగుజ్జులు."

బర్నయా, పొజర్టీ, మానెట్‌లాంటి వాళ్ళకు ఇప్పుడు సినిమారంగంలో స్థానం లేదు. ఫెయిర్‌బాంక్సు, హెరాల్డ్ లాయిడ్‌లాంటి ట్రిక్‌మాష్టర్లు ఆ స్థానాన్ని ఆక్రమించుకున్నారు. వైవిధ్యంలేని, నిరాశావాది అయిన, సనాతన భావాలను ప్రకోపింప జేసే (సెంటిమెంటల్) చార్లీచాప్లిన్ వీళ్ళందరికీ నాయకుడు. ఇదేవిధంగా క్లాసికల్ సంగీతానికి స్వస్తిచెప్పి ఆస్థానాన్ని జజ్, ఆక్రమించుకుంది. స్టెంధల్, బాల్జాక్, డికెన్సు, ఫ్లాబర్టుల స్థానంలో ఎడ్గర్ వాలెస్‌లాంటివాళ్ల ప్రవేశించారు. అసంఖ్యాక ప్రజలరక్తాన్ని

పీల్చిపిప్పిచేసే ప్రజా హంతకుల, ప్రజాపీడకుల ఆస్తిని కాపాడటానికి చిన్న చిన్న దొంగలనూ, సామాన్య హంతకులనూ 'బ్రహ్మాండంగా' వేటాడి పట్టుకునే పోలీసు ప్లానులనూ, పాత్రలనూ ప్రదర్శించడమే వీళ్ళకు చేతనయినపని. పోస్టు బిళ్ళలనూ ట్రాం టికెట్లనూ ప్రోగుచేయడం, ఇంకా మహాచేస్తే పాతయజమానుల చిత్రాలకు తప్పుడు నకళ్ళు తయారుచేయడంతోనే కళారంగంలో తన కర్తవ్యాన్ని 'జయప్రదంగా' నిర్వహించానని బూర్జువావర్గం సంతృప్తిపడుతూ ఉంది. ఇక సైన్సురంగంలో వీరు చేసిన కృషి ఏమిటయ్యా అంటే కష్టజీవుల శ్రమశక్తిని తమకు వీలుగా, చౌకగా ఉండేటట్లు దోచుకోడానికి కొత్తకొత్త పద్ధతులను కనిపెట్టడం, ఆ వర్గానికి కావలసిన ప్రయోజనం కూడా అంతవరకే సంచులు నింపుకోడం ఎలాగా అనేదే వారి సమస్య, అమితంగా తిన్నతిండిని అరిగించుకోడం- స్త్రీపురుష సంబంధాల్లో అరాచకంగా సంచరించడం- ఇవే వారిసైన్సుకు మూలసూత్రాలు. పెట్టుబడిదారీ కాడిక్రింద నలిగిపోయే బౌద్ధిక వికాసంతోగాని, ఆరోగ్యాభివృద్ధితోగానీ, జడపదార్థాన్ని 'శక్తి'గా మార్చడంతో గానీ, మానవశరీర నిర్మాణంతోగానీ, అభివృద్ధితోగానీ, టెక్నిక్‌తోగానీ, – వారికెట్టి సంబంధంలేదు. ఇవన్నీ బూర్జువాబుద్ధికి అతీతమైన విషయాలు. సెంట్రల్ ఆఫ్రికాను అనాగరికదశలో, బానిసత్వంలో అట్టిపెట్టడం ఎలాగో వాళ్ళకు కావాలిగాని ఇలాంటి వాటితో వాళ్ళకేం ప్రయోజనం?

తమ 'స్వతంత్ర ఆలోచన' తమ 'స్వతంత్ర మేధాశక్తి' ద్వారా 'కళాసృష్టి' చేయడం తమ కర్తవ్యం అని భావించే బుద్ధిజీవుల్లో కొందరు ఈ లోతుపాతులన్నీ గ్రహించిన తర్వాత 'కళాసృష్టి' చేయడం తమ పనికాదనీ, పెట్టుబడిదారీ ప్రపంచానికి సంస్కృతితో అవసరంలేదనీ ఇప్పుడిప్పుడే ప్లేటు మారుస్తున్నారు. చైనాలో జరిగిన సంఘటనలు - విశ్వవిద్యాలయాన్నీ, లోపెయిన్ లైబ్రరీని 1914 లో నాశనం చేయడం- వాళ్ళుచూశారు. షాంగ్‌హైలోని టుంగ్‌సీ విశ్వవిద్యాలయాన్నీ, నావికా కళాశాలనూ, మత్స్య పరిశ్రమ పాఠశాలనూ, జాతీయ విశ్వవిద్యాలయాన్నీ, ఇంజనీరింగ్ కళాశాలనూ, వైద్యకళాశాలనూ, వ్యవసాయ కళాశాలనూ, కార్మిక విశ్వవిద్యాలయాన్నీ ధ్వంసం చేస్తోన్న - కూలద్రోస్తూవున్న - జపాన్ ఫిరంగి గర్జనలు ఆలకించారు. కాని ఈ కిరాతక చర్యలేవీ వారిలో క్రోధజ్వాలను రగుల్కొల్పలేక పోయాయి.

ఆయుధాలను విపరీతంగా ఉత్పత్తి చేయడంతోపాటు విద్యాసంస్థ లీవిధంగా నాశనమైపోవడం వారికేమీపట్టనట్లే ఉంది!

యూరప్, అమెరికా మేధావివర్గంలో బహు కొద్దిమందిమాత్రమే 'మూడోశక్తి అంటూ వుండదు' అనే శాస్త్రీయసిద్ధాంతాన్ని ఇప్పుడిప్పుడే కొద్దికొద్దిగా అవగాహన చేసుకుంటున్నారు. ఐతే ఏపక్షంలోచేరాలి అనే సమస్య వారినింకా ఎదుర్కొంటోంది. కార్మికవర్గానికి వ్యతిరేకంగా పాత అలవాటుప్రకారం బూర్జువా పక్షం వైపుకు పోవడమా ? లేక బూర్జువావర్గానికి వ్యతిరేకంగా తాను న్యాయమని నమ్మిన శ్రామికపక్షం వైపు చేరడమా ? బుద్ధిజీవుల్లో ఎక్కువమంది పెట్టుబడిదారీ సేవజేయడంతోనే సంతృప్తి చెందుతున్నారు. కాని తన బానిస (మేధావివర్గం) యొక్క మెతకబుద్ధినీ, ఆ బానిస చేసే పని - ఓదార్చడం - తమకు నిష్ప్రయోజనమనీ నిరుపయోగమనీ గ్రహించిన బూర్జువావర్గం ఆ బానిసతో ఇక తనకేమీ నిమిత్తంలేదని అతనిని చులకనగా చూస్తూ వుంది.

బూర్జువా వర్గాన్ని ఓదార్చడంలో మంచి నేర్పు సంపాదించిన ఇలాంటి మహాశయుల వద్దనుంచికూడా తరుచుగా నాకు అనేక ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. ఉదాహరణగా అలాంటి ఉత్తరాన్ని ఒకటి యిక్కడ ఉద్ధరిస్తాను

"ప్రియమైన గోర్కీ:

అంతా అయోమయంగా ఉంది. ప్రపంచాన్ని అంతటినీ ఊపివేస్తున్న భయంకరమైన ఆర్థిక మాంద్యం ఫలితంగా నిరాశా నిస్పృహలు ఆవరించి దారీతెన్నూ కానలేకుండా ఉన్నాం. ఈ ప్రపంచవ్యాపిత సంక్షోభం 'టిడెన్సుటగన్' అనే సుప్రసిద్ధ నార్వే పత్రికకు అనేక వ్యాసాలు వ్రాసేటట్లుగా నన్ను పురికొల్పింది ఈ భయంకర సంక్షోభానికి గురి అయిన లక్షలకొలది ప్రజానీకంలో మళ్ళీ నూతనోత్సాహాన్ని రేకెత్తించి వారిలో ఆశాలతను పల్లవింప చేయడమే ఆ వ్యాసాల ఉద్దేశ్యం. ఈ ఆశయ సాధన కోసమే గత రెండు సంవత్సరాల్లో ప్రజలేవిధంగా నానాబాధ లనుభవించారో వాటిని గురించి తమ అభిప్రాయాలు తెలియజేయ వలసిందని సాహిత్య, కళా, సైన్సు, రాజకీయరంగ ప్రతినిధులను అర్థించడం అత్యవసరమని భావించాను. ఆర్థికమాంద్యం అనే దురదృష్టదేవత వాతబడి నశించిపోవడమా? లేక ఈ సమస్యను జయప్రదంగా పరిష్కరించగలమనే ఆశతో పోరాటం కొనసాగించడమా? అనేసమస్య నేడు ప్రతిదేశంలోని ప్రతివ్యక్తినీ ఎదుర్కొంటూ ఉంది. ఈనాటి నిరాశాపూరిత వాతావరణం నుంచి బైటపడడం ఎలాగా అని ప్రజలందరూ నిరీక్షిస్తున్నారు. తామువిశ్వసించే, గౌరవించే వ్యక్తి వెల్లడించిన ఆశాపూరిత అభిప్రాయము అంధకారావృత అసంఖ్యాక హృదయాల్లో ఆశాజ్యోతిని వెలిగిస్తుంది, కాబట్టే నేటి పరిస్థితిపై మీ అభిప్రాయాన్ని తెలియజేయ

వలసిందని మిమ్మలను అర్థిస్తున్నాను. ఈ అభిప్రాయం నాలుగుమూడు పంక్తుల్లోనే వ్యక్తమైనాసరే అనేక నిరాశామయ జీవితాల్లో నవజీవం పోస్తుంది. ఆశాపూరిత దృక్కులతో భవిష్యత్తువైపు తిలకించగల బలాన్ని ఇస్తుంది.

మీ

గౌరవనీయుడు

"స్వెన్ ఎల్వెర్‌స్టడ్"

ఈ ఉత్తరం వ్రాసిన వ్యక్తిలాంటి వాళ్లూ, 'రెండు మూడు పంక్తుల' ఔషధ శక్తిలో తమ సహజవిశ్వాసాన్ని కోల్పోవనట్టివాళ్ళూ - చాలామంది ఇంకా నివసిస్తూనే ఉన్నారు. కాని వారి విశ్వాసాన్ని హృదయపూర్వక విశ్వాసం అనజాలం. రెండు మూడు పంక్తులేకావు రెండు మూడువందల పంక్తులుకూడా వార్థక్యభారంచే కుంగిపోయే బూర్జువావర్గ శరీరావయవాల్లో నూతన జీవాన్నిపోయలేవు. నానాజాతి సమితి సమావేశాల్లోనూ, పార్లమెంట్ల సమావేశాల్లోనూ, ప్రతిరోజూ వేలకొలది గంభీరోపన్యాసాలు వినబడుతున్నాయి. కాని అవి ఎవరినీ ఓదార్చలేకపోతున్నాయి. ప్రజల పరితాపాన్ని శమింపజేయలేక పోతున్నాయి. వారిలో నూతనోత్సాహాన్ని కలిగించలేకపోతున్నాయి. మాజీ మంత్రులూ, తదితర సోమరిపోతులూ ఒక పట్టణంనుంచి మరో పట్టణానికి పర్యటనలపై పర్యటన చేస్తున్నారు. సైన్యానికి 'కళ్లెం' పెట్టబోతున్నాం అనీ, సైన్యాను అదుపులో- 'క్రమశిక్షణ'లో- ఉంచబోతున్నామనీ బూర్జువావర్గానికి నచ్చజెప్ప ప్రయత్నిస్తున్నారు. వీళ్లే మాట్లాడే చెత్తనంతా పత్రికా విలేఖరులు చిలకపలుకుల్లాగా వల్లిస్తున్నారు. ఇలాంటి పత్రికా విలేఖరులలో ఒకడైన ఎమిల్ లడ్విగ్ 'డెయిలీ ఎక్స్‌ప్రెస్' అనే ఒక పత్రికలో శాస్త్రప్రవీణులను తన్ని తరిమివేయాలంటూ ఒక వ్యాసం వ్రాశాడు. ఛోటా బూర్జువావర్గం ఈ ప్రముఖుడిచ్చిన సలహాకు తన చెవినొగ్గుతూ ఉంది. అతను వ్రాసిన చెత్తనంతా చదువుతూ ఉంది. ఆ చెత్తనుంచే తన మార్గాన్ని - కర్తవ్యాన్ని - నిర్ణయించుకుంటూంది. యూరోపియన్ బూర్జువావర్గం తమ విశ్వవిద్యాలయాలన్నింటిని మూసివేయాలని నిర్ణయించుకున్నా అందులో ఆశ్చర్యపడవలసింది ఆవంతకూడాలేదు. జర్మనీ విశ్వవిద్యాలయాల్లో ప్రతి సంవత్సరం పట్టభద్రులయ్యే 40 వేలమందిలో ఉద్యోగాలు లభించేది 6 వేలమందికి మాత్రమే.

(సశేషము)

# కొవాలి భావ విప్లవం!

కె. వి. రమణారెడ్డి

చిన్నప్పటి సంగతి. మా పడమటింటి గోడమీద పాత కాగితాల పేముబుట్ట ఉండేది. దాన్ని దించి కాగితాలు చూద్దామని బెంచిమీద నిలబడి మెడ నిక్కించాను. దుమ్ములో బూజులో ఒక పెద్దకత్తి కనిపించింది. ఖడ్గం అంటామే, అది! అదీ మా ఇంట్లో! గోడమీద ఎప్పుడు ఎవ్వరు పెట్టారో నా ఊహకు అందలేదు. చిన్నతనం కదూ! మా అమ్మను అడిగాను. తనకూ తెలియదని జవాబు. తాత ముత్తాతలనాటి లిబ్బి ఇదే నాపాలిటికి. తుప్పుబట్టి ఎక్కడికక్కడ గట్టిపెచ్చెలుగా రాలిపోతూన్న కత్తి.

తాత ముత్తాతల నాటిదాకా ఎందుకు? తన చిన్నతనంలో మా అమ్మ ఆడిన బొమ్మలతాలూకు బరువుకు చెక్కలు ఊడివచ్చేలా ఒకపెట్టె మరొక ఇంటిలో తాటిబద్దల ఆధారంమీద పడి ఉండేది. ఎన్నేళ్ళయిందో దాన్ని ఎవరుగానీ తెరిచిచూసి? అందులో బొమ్మలే ఉండేవో బొమ్మల తాలూకు భూశాలే ఉండేవో.

మా అమ్మ "పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు" చేయిస్తూ గుజ్జనగూళ్ళు వండి చెలులకు పెట్టిస్తూ ఉండిన రోజులదాకా ఎందుకు? నాకు ఉగదెలిసిన తర్వాత సంగతే ఇప్పుడు చెప్పబోయేది.

రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమయ్యేనాటికి నాకు పదేళ్ళ ప్రాయం. మా నాయన ఒక వెలుగువెలిగిన రోజులు. యుద్ధనిధికి ఏదో షుమారుపాటి మొత్తమేఇచ్చి, ప్రతిఫలంగాకాకున్నా పారితోషికంగానైనా, ఒక నాగలి సంపాదించాడు. ఆపాదమస్తకం అందులో కొయ్యే కానరాలేదు. అంతా ఇనుము. ఎలా వాడుకోందా మనుకొన్నాడో ఏమో, మా పెద్దపెట్టెలోపడేసి పెట్టాడు. అది అక్కడే కొన్నేళ్ళపాటు మూలుగుతూ ఉండిపోయింది.

ఇప్పుడు వెనకటి ఆ ఊసంతా ఎందుకని అంటారేమో. కత్తితో నాకూ ఆట బొమ్మలతో మా అ[illegible]కూ ఇనుప నాగలితో మా నాయనకూ పనిలేకపోయినా, అవి మూడూ పనికిమాలిపోయినవని చెప్పడానికైనా అది పనికివస్తుంది. వాటిలో మొదటిదీ రెండోదీ. కాలం [illegible] వెనకబడిన వస్తువిశేషాలు కాగా, మూడోది అప్పటికైనా అపూర్వమే కాబట్టి అ[illegible]పోయింది. అంటే, వస్తువులకూ, వాటిగురించి మనుషుల అభిప్రాయాలకూ, [illegible]లం తీరడంగానీ కాలం ఇంకా రాకపోవడంగానీ ఉంటుందన్నమాట, అప్పట్లో కా[illegible]పోయినా ఇప్పుడు తెలిసివస్తున్నది.

ఇప్పటికీ ఇలాంటి సంగతులను తెలుసుకొందామని కొందరు అనుకోడమే లేనప్పుడు, ఎలా తెలుసుకొంటారు? ఈ అనుకోకపోవడానికీ తెలుసుకోలేక పోవడానికీ ఏమిటి కారణం? నన్నడిగితే, భావ వాతావరణం అని బదులుచెబుతాను.

భావ వాతావరణం భారత దేశంలో స్తబ్ధంగా ఉండిపోయింది. పౌరాతన్యం దాని 'విశిష్టత'. గతానుగతికత్వం దాని 'సంప్రదాయం'. ఎంత పాతదైతే అంత 'శ్రేష్ఠం'- ఇలాంటి విలువలకు ఇంకా విలువ ఉంది. విశిష్టతకూ దుష్టతకూ అందరం ఎంచలేని వాళ్ళే. సంప్రదాయాన్నీ సాంప్రదాయికత్వాన్నీ. శ్రేష్ఠాన్నీ భ్రష్టాన్నీ, అది ఇదిగా ఎంచుకొంటున్నారు. ఈనాటికీ ఇదే జరుగుతూండడమే వింత. అంటే, పై మెరుగు లెన్నిదిద్దినా, పదార్థం చెక్కుచెదర లేదన్నమాట. మార్పులంటూ జరిగినా, అవి ఉపరి తలాన్నిదాటి కిందికి తగల లేదన్నమాట. మన గొంగళీ వేసినచోట వేసినట్టుగానే ఉంది. మన సమాజంలో శ్రమ విభజన, ఆస్తి సంబంధాలు. వాటిని ఆశ్రయించుకొని ఉండక తప్పని ఆలోచనలు వెనకచూపే చూస్తూ ఉండడానికి కారణమేమిటి? గడచిపోయిన కాలంనుంచి తాను స్వీకరించి తలదాల్చిన (అక్షరాలా తలదాల్చిన) మేధస్సామగ్రి పల్నాటిశనిలా శిరోభారమైకూడా, దిగిరావంటున్నది, దిగిపోనంటున్నది, భూస్థాపితం కానంటున్నది.

...But the philosophy of every epoch, since it is a definite sphere in the division of labour, has as its presupposition certain definite intellectual material handed down to it by its predecessors, from which it takes its start. And that is why economically backword countries can still play first fiddle in philosophy .. (Frederick Engels, Letter to conrad schmidt, Oct. 27, 1890.)

ఆర్థికంగా ఎంత వెనకబడి ఉంటే, 'తాత్వికంగా' అంత అగ్రేసరంగా ఉంటానికి కారణం, వెనకటిరోజుల బూజుని మెదళ్ల దళ్లనిండా పట్టించుకొని ఉండడమే. నిజానికి ఇది అక్కరకురాని తత్వం. ఎందుచేతనంటే, దానికి కాలదోశం పట్టింది. తాత ముత్తాతలనాటి ఖడ్గంలా తాను తుప్పట్టిపోయింది. స్టెయిన్లెస్ స్టీల్‌తో కత్తులు గాకుండా, అక్కరకువచ్చే వస్తువులు వంటింటినిండా ఉండే రోజులివి. అలాగే కన్న తల్లి చిన్నతనం తాలూకు లక్కపిడతలుగానీ రాజూరాణీ బొమ్మలుగానీ. ఇప్పుడు స్పూట్నిక్‌ల బొమ్మలు కావాలి; పోనీ రైళ్ళ బొమ్మలు కావాలి. పోనీ రైళ్ళబొమ్మలు కావాలి. విమానాల బొమ్మలు కావాలి; సైన్యదళం బొమ్మలు కావాలి. ఇనుపనాగలితో కూడా ఇప్పుడు పనిలేదు. ట్రాక్టర్ల, బుల్‌డోజర్ల కాలమిది. ఏ కాలానికి తగిన ధమేస్సామగ్రి ఆ కాలానికి ఉండాలి.

భూస్వామ్య యుగం తాలూకు భావాలు ధనస్వామ్య యుగంలోనే పనికిరానప్పుడు సామ్యవాద యుగానికి ఎలా సరిపోగలవు? మనం ధనస్వామ్య యుగం లోగిటిలోనే మసలుతూ ఉన్నా మన మనస్సులు ఇంకా భూస్వామ్య యుగావరణం నుంచి పూర్తిగా బయటపడలేదు.

ఇందుకూ కారణం ఉంది. భూస్వామ్యయుగం, ధనస్వామ్యయుగం మనదేశ చరిత్రలో ఒకదానిలోకి ఒకటి చొచ్చుకువచ్చాయి. ఇంగ్లీషువాడు భూస్వామ్యాన్ని పోషించి పెంచాడు. ధనస్వామ్యాన్ని ఎక్కరానీయకుండా అభిమన్యుడికి సైంధవుడిలా అడ్డుపడ్డాడు. తన రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలకోసమే ఈవలపక్షం. అయితే వాడి ఇనుపచట్రం కూడా ధనస్వామ్యాన్ని నిరోధించలేక పోయింది. సూదిగా మొనసూపి అది దబ్బనంగా పరిణమించింది. జెమ్‌షెడ్‌జీ తాతాలాంటి వ్యక్తిమాత్రుల స్వల్ప ప్రయత్నాలతో ప్రారంభమై అది దేశ ఆర్థికతలాన్నంతా కమ్మకు రాసాగింది. చిత్ర మేమిటంటే మన భూస్వాములు, వడ్డీ వ్యాపారులు వగైరా ఈ అధికలాభసాటి ఆర్థిక సంబంధాలను చూసి మనస్సయ్యారు. మొదట్లో రాజకీయ ప్రతిఘటనకూడా చేసినా, పార్టీలుపెట్టి ప్రభుత్వానికి వత్తాసినిచ్చినా, చివరకు ధనస్వామ్య సంస్థలకు దిగవారి వచ్చారు. మిలాఖత్తయ్యారు. మమేకమైపోయారు. కాంగ్రెస్‌పార్టీ గుడారం కింద చేతులు కలుపుకొన్నారు, బుజాలు రాచుకొన్నారు. ఫలితంగా, ఇప్పుడు రాజ్యాధికారంలో కూడా వంతు పుచ్చుకొంటున్నారు. మన ధనస్వామ్యాని కింకా భూస్వామ్యపు పురిటి వాసనలు పూర్తిగా పోకపోవడానికి ఇదే కారణం. వారు వీరౌతున్నారు, వీరువారౌతున్నారుగాని వెరసి, "జనం" మాత్రం వేరౌతున్నారు.

జనమంటే ఎవరు? ఇంకా ఎవళ్ళకెవళ్లకైతే తినతిండీ కట్టబట్టా ఉండ విల్లులాంటి కనీస వసతులుకూడా తీవ్ర జీవనసమస్య లౌతున్నాయో వాళ్ళేగాని, కడుపులో చల్ల కదలకుండా నీడపట్టునగానీ ఎయిర్ కండిషన్డ్ గదుల్లోగానీ కూర్చోగల తాహత్తు ఉన్న షురానా మనుషులుకాదు ఎవరికి ఇంకా ఆర్థికానికీ అనర్థకానికీ తేడాలేదో వాళ్లే జనంగాని, డబ్బు సంచులతోగానీ బ్యాంకి బ్యాలన్సులతోగానీ విక్షేపరాయుళ్ళలా బలకగలిగిన బడా బాబులుకాదు. ఎవరికి ఇంకా వట్టిరాజకీయ ప్రజాస్వామ్యంలో అధికార గోమాత పాల బొట్టుకూడా విదిలించదో వాళ్ళే జనంగాని, అవసరంవస్తే పొదుగుకోపి బాల్చీలనిండా పాలు పట్టుకెళ్ళి పాలసముద్రంలోనే పవ్వళించగల విష్ణుమూర్తులు కాదు ఆర్థికంగా పరాధీనంగా ఉన్న వాళ్ళెవళ్ళయినా రాజకీయాధికారాన్ని అనుభవిస్తారంటే, ఎవరైనా నవ్వి పోగలరు వాళ్ళకు నిజంగానే ఆర్థిక, రాజకీయాధికారం గూడా చేజిక్కితే, యుగమే మారిపోతుంది. అప్పుడు దాన్ని సోషలిజం అంటాం. వట్టి 'జనం'గా ఉండినవాళ్ళు

సోషలిజాన్ని తెచ్చేప్పుడు ప్రజలౌతారు. సోషలిజాన్ని నిర్మించేప్పుడు మహాప్రజ అవుతారు.

తాము ఉంటూన్న స్థితిలో ఏ జనానికైనా గమ్యం అదే కావాలి, అయితే మన జనానికి, "మరో ప్రపంచం, మహాప్రపంచం" చూపలేక, కొందరు ఉన్నదానితో సర్దుకు పొమ్మంటున్నారు. భూస్వామ్యాన్ని తోసినేసినా, ధనస్వామ్యాన్ని నిలిపి ఉంచి దాని అధికారవర్గంతోటి జనాన్ని ముడివేసి మసిబూసి మారేడుకాయ చేద్దామంటున్నారు. డేగలకూ పావురాలకూ మధ్య, సింహాలకూ లేళ్ళకూ మధ్య సఖ్యం కుదిరితే, పరకష్టోపజీవులకూ కష్టజీవులకూ మధ్య ఎందుకు కుదరదు? కాబట్టి democracy అనబడే రాజ్యాంగ వ్యవస్థ ధనస్వామ్యానికి వేసిన మేలిముసుగైతే, National Democracy అనబడేది కుహనా కమ్యూనిస్టుల వర్గసాంకర్య ధోరణికి మేలిముసుగు. ధనస్వామ్యం నుంచి నెమ్మదిమీద "శాంతియుతం"గా వెలువడబోయే సోషలిజం అవుపెయ్యా గేదెపెయ్యా కాకుండా పోతుంది.

ధనస్వామ్యాన్ని విధ్వంసించని సోషలిజం మరేదైనా కాగలదు గాని 'సోషలిజం' కాబోదు. విధ్వంసించడమంటే, ఉన్న పురువులనన్నిటినీ ముక్కలయేలా పగలగొట్టడం కాదు. రాజ్యాంగ యంత్రాన్ని ఉన్నది ఉన్నట్లుగా నిలిపి ఉంచడమూ కాదు. మెత్తగా చెప్పగా, ఈమర తీసివేసీ ఆమర తెచ్చిపెట్టీ రిపేరుచేయడం కాదు. విప్లవం అంటే మూలమట్టమైన మార్పు. అవసరాన్నిబట్టి బలప్రయోగం తప్పదు. ఈ 'ఫోర్పు' వట్టిఫార్సుగా మారాలంటే తప్ప, ఇందులోకి 'సమ్మతి' (consent) ప్రసక్తి తీసుకురాగూడదు. అధిక సంఖ్యాకుల సమ్మతిమీద, జనవాక్యం మీద, జరిగిన విప్లవం ఏదీలేదు. ఉండబోదు కూడా.

'విప్లవం' అంటేనే విహ్వలించే వాళ్లున్నారు. అడుగుమీద అడుగువేసుకొంటూ వెళ్లే పరిణామం, ఉన్నట్టుండి ఒక అంగవేస్తే, ఒకదుముకు దుమికితే, అదే విప్లవం. రాశిలోవస్తూన్న మార్పు ఒకానొక అనుకూల పరిస్థితిలో అవస్తువుగుణంలోనే మార్పాతుంది (From the quantitative to the qualitative) కోడిగుడ్డులోని జెన పిల్లగా పరిణమిస్తుందే, అదే గుణాత్మకమైన మార్పు. మార్క్సుకంటె ముందే హెగెల్ ఈ సత్యాన్ని ప్రతిపాదించాడు.

Hegel's discovery of the universal law of transfarmation of quantity into quality is, seen historically, a philosophic methodology for the idea that revolutions constitute necessary organic components of evolution and that without such a 'modal line of proportions' true evolution is impossible in reality and unthinkable philosophically. (The Historical Novel: Georg Lukacs)

దేశం, సమాజం మునుసాగాలన్నప్పుడు, విప్లవం అనివార్యమేగాక అభిలష ణీయంకూడా. నిజమైన పరిణామవాది విప్లవాన్ని చేయెత్తి ఆహ్వానిస్తాడు; లేకుంటే అతడు నిశ్చలతావాది కాకతప్పదు నిశ్చలతావాదులు మన సమాజంలో క్రమపరిణామవాదులుగా వ్యవహరించగలుగుతున్నారు. ఇది విచారకరం. ఆర్థిక, రాజకీయ విప్లవాలను అభి మానించేవాళ్లుగూడా భావాల విషయంలో వెనకబడిగానీ ఉన్నచోటనే పడిగానీ ఉంటు న్నారు. నిజానికి విప్లవమనేది సర్వవ్యాపి. కాకుంటే ఆర్థిక, రాజకీయ విప్లవానికి ముందు భావవిప్లవం అవసరమా? ఈ సందేహం అనవసరం, అనాలోచితంకూడా.

ఈ అనుమానాన్ని తోటమాలిగాకున్నా సుడిగాలైనా తీరుస్తుంది. మోడువడిన చెట్టునుంచి ఆకుల్ని ఎలా తోటమాలి సృష్టించలేదో, ముదురాకుల్ని చిగురాకులుగా మార్చడానికి ముందు ప్రకృతి ముదురాకుల్ని పండబారిస్తే సుడిగాలి రాల్చివేస్తుంది. ఆ చెట్టుకు ప్రతి ఏడాదీ పునర్జన్మే. అదే మన ఉగాది సమాజం విషయంలో మాత్రం ఆ పునర్నవాన్ని 'విప్లవం' 'విప్లవం' అంటూ అటకాయించబోతాం. అంతమాత్రాన విప్లవం ఆగదుగాని మన పిరికితనం బయటపడుతుంది, అంతే.

ఏ భావాలైతే మన సామాజిక పునర్నవానికి గుదిబండలుగా ఉన్నాయో వాటిని ప్రయత్నపూర్వకంగా తొలగించాలని ఉద్యమిస్తేనే భావ విప్లవం మొదలౌతుంది. దీనికి నాందీవాచకం, లక్ష్యనిర్దేశం రాబోయే ఏ యుగానికి సన్నాహంగా ఈ విప్లవాన్ని ఘటింపచేద్దామన్నదే మొదటి విషయం.

విప్లవ రచయితల సంఘం ఉద్యమించిందే, సోషలిజం— మార్క్సియన్ సోష లిజం— అవతరణకోసం పనిచేస్తూన్న ప్రజాశక్తులకు సాహిత్య దోహదం చెయ్యడం కోసం. అది రాజకీయశక్తులకు దాస్యం చెయ్యడమౌతుందా కాదా అనే శంక, కుశంక. కిట్టనివాళ్లు దాస్యమంటారు తప్ప నిజానికి అది తోడ్పాటు సాహిత్యకారులు జీవిత సముద్రంలోని తరంగాలేగాని తటస్థులుకాదు. జీవితాన్ని ఇష్టాధీనంగా రూపుదిద్దే రాజ కీయాన్ని, మేనకకన్న శకుంతలను విశ్వామిత్రుడిలా వద్దుపొమ్మని ధిక్కరించకుండా, చేరబిలిచి గౌరవిస్తారు, రచయిత తన పౌరబాధ్యతను రెండుచేతులా పొదివిపట్టు కొంటాడు. సంఘ–వ్యక్తితో సాహిత్య–వ్యక్తి అభేదం పొందుతుంది. అయినా రాజ కీయ కార్యరంగం సాహిత్యరంగాన్నీ, సాహిత్యరంగం రాజకీయ కార్యరంగాన్నీ దురాక్రమించవు. అట్లని, అవి ఒకదాని తలుపులు మరొకదానికి మూతబడిన విడివిడి గదులేమీకావు. జీవితం అనే పువ్వులో అది రెండురేకులు. ఆ ఇంటిమీది కాకి ఈ ఇంటి మీద వాలవచ్చు కాబట్టి సోషలిజం కోసం రెండూ రెండు సాధనాలే.

'భావవిప్లవం'అనేమాట కొందరిని భయపెట్టినా ఆశ్చర్యంలేదు. సాంస్కృతిక విప్లవానికీ దీనికీ పోలికలేమైనా ఉన్నాయేమోనని కొందరు టయులుదేరవచ్చు నిజానికి లెనిన్ హయాములో సోవియట్ రష్యాలోనూ, ఇటీవల మావో సారథ్యాన జనచైనా

లోనూ, సాంస్కృతికవిప్లవాలు జరిగాయి. లెనిన్‌నాటిదీ మావోనాటిదీ మనకు రేపటిదే. భావవిప్లవం రాజకీయ విప్లవానికి నాంది. సాంస్కృతిక విప్లవం రాజకీయ విప్లవానికి పరాకాష్ఠ. అయితే రెండింటికీ లక్ష్యం సమానమే— ప్రజల మనస్సులనుపట్టి పల్లారుస్తూన్న భావపిశాచరూపాలను ఉచ్చాటనచేసి, యుగావసరాలకు అనుగుణంగా ప్రజల చైతన్యాన్ని మలచడం!

ప్రజలకు 'చారిత్రికదృక్పథం' ఏర్పడడం భావవిప్లవంలో మొట్టమొదటి మెట్టు. ప్రతి సమాజానికీ నిన్నఅనేది ఉన్నట్టే రేపు అనేదికూడా ఉంటుందని, నిన్నలాగా నేడు ఎలా లేదో నేటిలాగా రేపుకూడా అలాగే ఉండదని, అలాఉండకుండాలంటే వ్యక్తులుగా సామూహికంగా తాము పూనుకోవాలని, చరిత్రగతిని తాము శాసించగలమని, భవిష్యత్సమాజాన్ని తాము నిర్మించగలమని కాలంగురించి ఒక స్పృహఉండడమే చారిత్రక దృక్పథం. ఇతరులాడిస్తే ఆడడంగాక తామే చైతన్యంతోటి కదలబారి చరిత్రను మార్చుకొనేందుకు పూనుకొంటేనే, చారిత్రకదృక్పథం అలవడినట్టులెక్క.

ఈ స్పృహగానీ చైతన్యంగానీ సంస్కరణల ద్వారా కలగదు. సంస్కరణలనేవి అధికారవర్గం నుంచి వెలువడేవేగాని ప్రజలు కదిలి తెచ్చుకునేవి కావు పైగా, మాట్లువేస్తేచాలు లెమ్మనుకొనే ఉదాసీనతనుకూడా కలిగించే ప్రమాదం ఉంది. చారిత్రక దృక్పథాన్ని అవి మందగింపజేస్తాయి తప్ప పదును పెట్టలేవు. పోరాటమార్గ మొక్కటే ప్రజల చారిత్రిక స్పృహకు విస్ఫూర్తిని కలగజేస్తుంది. అయితే ఒక మినహాయింపు. అవి ప్రజలు పాల్గొనే పోరాటాలై ఉండాలిగాని ప్రజలకోసం కొద్దిమంది జరిపే పోరాటాలై ఉంటే మాత్రం, పెద్దగా లాభించదు. నాయకులు లేకుండా ప్రజలు తమంత తాముగా (spant ncous) గా పోరాడుతా రనుకోవడం భ్రమ అలాంటి పోరాటాలు కృతకృత్యమవుతాయని ఆశించడం దురాశ. ప్రజలలో భాగంగా ఉండి ప్రజాప్రమేయం కలిగి ముందు తానుండి నడపడం కోసమేనని, లెనిన్ కమ్యూనిస్టు పార్టీని సృష్టించాడు. అది ప్రజల ఖడ్గసృష్టి. పార్టీ ప్రచార ప్రబోధాలద్వారా ప్రజల్లో సమస్యలపట్ల సరైన గుర్తింపు ఏర్పడి వాళ్లు పోరాటమార్గానికి దిగినప్పుడు, ఆ పోరాటాలే చారిత్రక చైతన్యాన్ని బోధించె పాఠాలు. వర్గపోరాటాలే చరిత్ర పాఠాలు

భావ విప్లవం ఈ పోరాటాలనుంచే ఉత్పన్నమౌతుంది. ఉత్పన్నమైె పోరాటాలకు ఊపునిస్తుంది. చెట్టపట్టాలు పట్టుకొని అవి రెండూ ముందుకుపోతాయి ప్రజల్లో అత్యంత చైతన్యంగల భాగమే పార్టీ అనుకొన్నప్పుడు, సోషలిస్టు సమాజ సాధనకు కమ్యూనిస్టుపార్టీని తప్ప మరొక పార్టీని, కమ్యూనిస్టు పార్టీలోనూ అత్యున్నత పోరాట మార్గాన్ని అనుసరించే వాళ్లను తప్ప మరొకళ్లను, నమ్ముకొనే వ్యక్తి కుక్కతోకబట్టి గోదావరి ఈదుతాననేవాడు

---

వచ్చే సంచికలో భావ విప్లవం — 2

ఎండుటాకులు — సుడిగాలి కె. వి. రమణారెడ్డి

# ఉత్పల్ దత్ నాటకాలు

నిఖిలేశ్వర్

ప్రజలకోసం ప్రజల జీవితాన్ని, ప్రజల న్యాయాన్ని చిత్తశుద్ధితో చిత్రించి ప్రజలకొక మార్గాన్ని నిర్దేశించే రచయితలు ఏభాషలోనైనా అరుదుగానే వుంటారు. అందులో సమకాలీన యదార్థంగా ప్రతిబింబించి పోరాటతత్వాన్ని పెంపొందించే రచయితలు మరీ అరుదు.

ఎలాంటి ప్రభుత్వం వున్నా ఆ వ్యవస్థలోవుండే లోపాలని, జరిగే అన్యాయాల్ని నిర్భయ గా ఎత్తిచూపి ప్రజలను మేల్కొల్పేవాడే ప్రజారచయిత– అలాంటి ప్రజా రచయితల్లో ఈనాటికి తన కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నవాడు ఉత్పల్ దత్. బెంగాలీ భాషలో నాటకాలు రచిస్తూ బెంగాలీ రంగస్థలంపై విప్లవ సాంప్రదాయాన్ని నెలకొల్పిన దత్ మిగతా భాషల్లోని రచయితలకు ముఖ్యంగా నాటక రచయితలకు– నటులకు సజీవమైన ఆదర్శం.

కొందరికి ఉత్పల్ దత్ పేరు వినగానే 'ది గురు'అనే ఇంగ్లీషు సినిమా, "భువన్ షోమ్", "గుడ్డీ" అనే బెంగాలీ, హిందీ సినిమాలు జ్ఞాపకం రావచ్చు. మరికొందరికి విప్లవ నాటకాలు రచించి నిర్భయంగా ప్రదర్శించిన నాటక రచయిత– నటుడు జ్ఞాపకం రావచ్చు

ఆధునిక బెంగాలీ రంగస్థలం గురించి అంచనా వేసుకుంటే అది కాలానుగుణ్యంగా పరిణామం చెందుతూ సజీవంగా వున్నట్టు తెలుస్తుంది. నాటక రచనలో, ప్రదర్శనలో చాలా ప్రయోగాలు జరుగుతూ వచ్చాయి పాశ్చాత్య నాటకాల ప్రభావంకూడా చాలా వుంది. ఇక భారతీయ నాటకరంగంలో బెంగాలీ రంగస్థలం ఈనాటికి ఎన్నో ప్రయోగాలు చేస్తూ ప్రముఖపాత్ర వహిస్తున్నది. ప్రస్తుతం అక్కడ ప్రముఖంగా కృషి చేస్తున్న నాటకసంస్థలు ఇవి–

శంభుమిత్రసంస్థ "బహురూపి", ఉత్పల్దత్సంస్థ" లిటిల్ థియేటర్ గ్రూప్", "నాందీకార్"అనే అభ్యుదయనాటకసంస్థ, బాదల్సర్కార్ సంస్థ–"శతాబ్దీ" మొదలైనవి

ఉత్పల్ తన "లిటిల్ థియేటర్ గ్రూప్" ద్వారా జర్మన్ నాటక రచయిత-ప్రయోక్త బెర్టోల్ట్ బ్రెక్ట్ ప్రయోగాత్మకరీతులను, మార్క్సియన్ దృక్పథాన్ని, రష్యన్ ప్రయోక్త స్టానిస్లావస్కీ యదార్థవాదాన్ని సమన్వయం చేశాడు నటుడికి- ప్రేక్షకులకి మధ్యవుండే సంబంధాన్ని మరింత సన్నిహితంచేసి వాస్తవికతను వ్యంగ్యంగా హాస్యంగా ప్రదర్శింప చేశాడు. సినిమాలలో నటిస్తూనే బెంగాలీ రంగస్థలానికికూడా ఇతోధికంగా సేవ చేస్తున్నాడు. తెలుగు నటుడు నాగభూషణంలాగా ఒకే ఒక నాటకం "రక్తకన్నీరు"ను పట్టుకొని వేలాడకుండా, ('కలికాలం' అనే మరోనాటకాన్ని అడపాదడపా ప్రదర్శిస్తున్నాడనుకోండి!) నాటకాన్ని వ్యాపారమనస్తత్వంతో, చౌకబారుస్థాయిలో సినిమా అనుకరణతో కాకుండా, నిత్యచైతన్యవంతంగా కళావిలువలనుపాటిస్తూ ప్రజలపట్ల తన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాడు.

ఉత్పల్ దత్ "కల్లోల్" నాటకంద్వారా భారతీయ నాటక సాహిత్యంలో ప్రముఖ స్థానాన్నిపొందాడు. 1946లో బొంబాయిలో చెలరేగిన నావికుల తిరుగుబాటును యితివృత్తంగా తీసుకొని ఆయన ఆ నాటకాన్ని రచించాడు. రాయల్ ఇండియన్ నేవీ తిరుగుబాటు (R. I. N. Mutiny) భారతీయ స్వాతంత్ర్య పోరాటంలో ప్రధానమైన ఘట్టము. ఆ ఘట్టాన్ని ఉత్పల్ దత్ మార్క్సిస్టు అవగాహనతో రచించి కలకత్తాలో రెండేళ్లపాటు ప్రదర్శించాడు. విదేశీ దోపిడిగాళ్లతో స్వదేశదోపిడిగాళ్లు చేసుకొన్న రాజీబేరమే భారతదేశ స్వాతంత్ర్యమనే చారిత్రిక యథార్థాన్ని ఉత్పల్ శక్తివంతంగా చూపగలిగాడు.

ఈ నాటకంలో చాలామంది పాత్రలు వస్తారు. రంగస్థల అలంకరణకూడా శ్రమతో- వ్యయంతో కూడుకున్నదే! అందువల్ల అమెచ్యూర్ నాటకసంస్థలకు ప్రదర్శన సాధ్యంకాదు. "కల్లోల్"ని తెలుగులోకి మద్దిపట్ల సూరి అనువదించారు. కాని ప్రదర్శనమాత్రం సాధ్యంకాలేదు.

రెండోనాటకం "తీర్". బాణం ప్రతీకగావున్న యీ నాటకంకూడా కలకత్తాలో చాలాసార్లు ఆడింది. నక్సల్బరీలో వచ్చిన రైతాంగ సాయుధపోరాటాన్ని ఈనాటకం ప్రజలకు చూపించింది. నిర్భయంగా వాస్తవపరిస్థితులను ప్రజలముందువిప్పిచెప్పింది.

ఉత్పల్ దత్ నాటకాలలో మూడోది 'అంగార్'. ఈ నాటకాన్ని బెంగాలీలోనే కాకుండా హిందీలోకూడా సమర్థవంతంగా ప్రదర్శించారు. బొగ్గుగనులలో పనిచేసే కార్మికులపట్ల కొనసాగుతున్న దోపిడిని, అన్యాయాన్ని ఈ నాటకం బహిర్గతంచేసింది.

'ఫరారీఫౌజ్'అనే మరో నాటకంద్వారా భారత స్వాతంత్ర్య సంగ్రామకాలంలో విఫలమైన తీవ్రవాదుల ఉద్యమాన్ని వ్యంగ్యంగా వ్యక్తంచేశాడు.

ఆదిత్యమల్ల బర్మన్ రచన ఆధారంగా దత్ 'తితాస్ ఎక్తి నదీర్ నామ్' అనే నాటకాన్నికూడా ప్రదర్శించాడు. ఈ నాటకం బెంగాలీలో మారుమూలలోవున్న కోస్తా పాంతపు బెస్తవాళ్ళ నికృష్ట జీవితాలను చిత్రించింది.

ఇటీవల ఆయన 'సూర్యశిఖ' అనే ప్రయోగాత్మకమైన మరో నాటకాన్ని ప్రదర్శించినట్టు తెలుస్తున్నది. ఇక దత్ ప్రదర్శించిన మరో ముఖ్యమైన నాటకాన్ని వివరించేముందు ఆయనపైవున్న యీ విమర్శను తెలుసుకోడం అవసరం. కళకోసమే తాపత్రియపడే కొందరు విమర్శకులు ఉత్పల్‌దత్ మార్క్సిస్టు అవగాహనవున్నా కేవలం రాజకీయవివాదాలతో కళావిలువల్ని విస్మరిస్తారని, సాంకేతిక విలువల్నిమాత్రం గొప్పగా పోషిస్తున్నారని వ్యాఖ్యానిస్తున్నారు.

కలకత్తాలో ఉగ్రవాదులపై కొనసాగుతున్న పోలీసుల చిత్రహింసలను ఇతివృత్తంగా తీసుకొని ఆయన ఆ మరో ముఖ్యనాటకాన్ని రచించారు. గత సంవత్సరం ప్రదర్శించబడిన ఈ నాటకం పేరు "టోర్గి ఎలో దేశే". థగ్గులు లేక దోపిడిదొంగలు వచ్చారనే శీర్షికతో వచ్చిన ఈ నాటకంలోని ఇతివృత్తం ఇది—

ఒక పోలీసు కానిస్టేబుల్ హత్యతో సంబంధం వుందనే ఆరోపణపై 17 సం॥ల పిల్లవాణ్ణి పోలీసులు అరెస్టుచేసి ఆ తర్వాత కస్టడీలోవుండగా కాల్చేస్తారు. పోలీసు వ్యాన్‌లో నుండి దిగుతుండగా ఆ పిల్లవాడు బాంబువేయడానికి ప్రయత్నించాడని అధికారుల కథనం. ఆ తర్వాత ఆ పిల్లవాడి తల్లి తండ్రులు ఎంతో కష్టంమీద న్యాయ విచారణ జరిపించ గలుగుతారు. చట్టానికి సంబంధించిన కొన్ని ఇరకాటాలవల్ల అసలు న్యాయం జరగదు, కాని అసలు వాస్తవం బయటపడుతుంది. ఒక ఫ్యాక్టరీ యజమాని ప్రోద్బలంతో ఆ పిల్లవాడు పోలీసుల చేతుల్లో పడతాడు. ఇంతకు ఆ కానిస్టేబుల్ హత్య పోలీస్ యూనియన్‌లో అతని కార్యకలాపాలవల్ల జరుగుతుంది.

ఈ నాటకంలో ఉత్పల్‌దత్ అత్యాశాపరుడైన న్యాయవాది పాత్ర ధరించాడు. డబ్బుకోసం అతను నక్సలైట్లను, మార్క్సిస్టులను ఎవరినీ లెక్క చేయడు. అయితే ఆ పిల్లవాడు నిర్దోషి అనే వాస్తవాన్ని గ్రహించిన ఆ న్యాయవాది నిర్మొగమాటంగా, నిస్సంకోచంగా పోలీసు రాజ్యంలోని ప్రభుత్వ యంత్రాంగాన్ని బట్టబయలు చేస్తాడు. ప్రభుత్వానికి ముఖ్య సలహాదారు (principal advisor) గా వున్న రాష్ట్రప్రభుత్వ అధికారిని బోనులో నిలబెట్టి ఎన్నో నగ్నసత్యాలను లాగుతాడు. అసలు పశ్చిమ బెంగాల్‌లోని అలజడికి అరాచకవాదులు కారణం కాదని, కేంద్ర ప్రభుత్వమేనని స్పష్టం చేస్తాడు. దేశంలోని తూర్పుభాగాన్ని వలసప్రాంతంగా పాలించడంవల్ల హింస

చెలరేగుతోందని, హింస విదేశీయమైనది కాదని, వివేకానంద, సుభాష్‌బోస్ లాంటి మహావ్యక్తులు "హింస"ను న్యాయసాధన కోసం సమర్థించారని చెబుతాడు.

దాదాపు 150 నిమిషాలపాటుసాగే ఈ నాటకంలో ఫ్యాక్టరీ యజమాని, అతను మాట్లాడే ఆడంబరపూరితమైన బెంగాలీభాష చంపబడ్డ కుర్రవాని అన్నయ్యపై జరిగిన పోలీసు హింసాకాండ తదితర విషయాలు నవ్వును, కోపాన్ని, జాలిని కలిగిస్తాయని ఒక నాటక విమర్శకుని అభిప్రాయం. చివరికి ఆ కుర్రవానితల్లి ప్రజల అంతరాత్మను సంభోధిస్తూ మాట్లాడుతుంది. వీరోచితంగావుండేబదులు యిది సెంటిమెంటల్‌గా ధ్వనిస్తుందని ఒక విమర్శ.

అయితే 'టోర్డి ఎలోదేశే' నాటకంద్వారా ఉత్పల్‌దత్ థగ్గులను ఎదుర్కోడానికి 'యునైటెడ్ డెమోక్రెటిక్ ఫ్రంట్' అవసరమనే విషయాన్ని చెప్పదలచుకున్నాడని, ఈ నాటకం మార్క్సిస్టులపాత్రను బహిర్గతంచేయడంలేదని బెంగాళినాటక విమర్శకుల అభిప్రాయం. నక్సలైట్లనుగాలించే కార్యక్రమంలో మార్క్సిస్టులు పోలీసు ఏజంటుగా ప్రవర్తిస్తున్నారని. వాళ్ళకు ప్రతిరోజూ చంపబడుతున్న యువకులపట్ల ఏమాత్రం సానుభూతిలేదని, ఈ అంశాన్ని ఉత్పల్ విస్మరించాడని ఆ విమర్శకుల వ్యాఖ్య.

ఉత్పల్‌దత్ తన ఈ కొత్తనాటకంద్వారా పోలీసురాజ్యంలో కొనసాగే అమానుషమైన చిత్రహింసలను నిర్భయంగా ప్రజలముందు ప్రదర్శించి తన నిబద్ధతను (Commitment) మరోసారి నిరూపించుకున్నాడు.

మళ్ళీ వస్తున్నాయి మార్చిలో
ఎన్నికలు ఎన్నో వస్తున్నాయి, పోతున్నాయి
పంచాయితీలకు, అసెంబ్లీలకు, పార్లమెంటుకు
మామూలుగా, మధ్యంతరంగా
ప్రీవీపర్సులు రద్దుచేసేందుకు, యుద్ధంలో గెలిచినందుకు
అయినా యీ అసమ సమాజవ్యవస్థ అలాగే వుంటున్నది
వ్యవస్థ— యీ యదార్థాన్ని చాటే
నవీన్ నాటిక వచ్చే సంచికలో చదవండి.

# తెలుగులో సీరియల్ నవలలు

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

పత్రిక వ్యాపారానికి పనికివచ్చే నవలని సీరియల్ నవల అంటాము. దీని ప్రచురణ ధారావాహికంగా జరుగుతుంది కాబట్టి కొని చదివేందుకు జనం ఎగబడే నవల సీరియల్ నవల. పత్రికలలో అచ్చయే ఉత్తరాలలో 'ఈవారం కొత్తమలుపు తిరిగింది. ముందేమి జరుగుతుందో అని ఆదుర్దాగా వుంది' అని పాఠకులు రాస్తూవుంటారు. వారానికో కొత్తమలుపు. 'ముందేమి జరుగుతుందో అనే ఆదుర్దా' కలిగించటం సీరియల్ నవలకు ముఖ్యలక్షణం, అదే ఫార్ములా రాసేవారికి. సీరియల్ నవలాపఠనం కాస్సేపు నడుం వాల్చుకుని కన్నుమూతపడే వరకూ జరిగే కాలక్షేపం. కాస్సేపు చదివేవారు మైమరచి ఆనందలోకాల్లో విహరించాలి. అంటే నవలనుంచి పాఠకులు పొందేది వైయక్తికమైన ఆనందం. సే–వినోదం।

కొందరికి అభూతకల్పనలు నచ్చుతాయి. కొందరికి కోతలు నచ్చుతాయి కొందరికి రొమాన్సులు, లవ్వులూ, పడకటింటి ముచ్చట్లూ నచ్చుతాయి. కొందరికి చరిత్రి యిష్టమైతే కొందరికి దేశభక్తి యిష్టం. కొందరికి సంఘ సంస్కరణ - మార్పు లిష్టమైతే కొందరికి సనాతనధర్మ పునః ప్రతిష్ఠాపన యిష్టం. కొందరికి అభ్యుదయం యిష్టమైతే కొందరికి విప్లవం ఉిష్టం.

కొంతమంది యింటి చాకిరీ మర్చిపోవటానికి సీరియల్స్ చదివితే, కొంతమంది సంసారబాధల్ని పక్కకు నెట్టేసి ఆనందించటానికి చదువుతారు.

తెలుగులో వచన రచన రాజ్యం ఏలుతోంది అని మనం వప్పుకుంటే అందులో ముఖ్యంగా నవలదే అగ్రతాంబూలం. వ్యాపారదృష్ట్యా చూసినా కాలక్షేపం దృష్ట్యా చూసినా నాలుగు రాళ్లు చేసుకోవటంలో నవలా రచయితలకు ఎక్కువ అవకాశమిస్తున్నదీ సమాజం పాఠకుల సంఖ్య పెరగటం వలన ఒకే ఫార్ములామీద (అనగా రెండు సీరియల్సూ, నాలుగు కథలూ, ఏవో మూడు నాలుగు శీర్షికలూ, జోకుసు, కార్టూన్లు, గేయాలు, ఐదారు పేజీలు సినిమా) నడిచే పత్రికలు ఎక్కువయాయి. దిన పత్రికలకు అనుబంధంగా నడిచే వారపత్రికలు ప్రజాదరణను పొందుతున్నాయి. పత్రికలు ఎక్కువ కావటంవలన రచయిత లెక్కువయారు, కథలూ నవలలూ ఎక్కువ వస్తున్నాయి. అయితే యీ వచ్చే సీరియల్ నవలల్లోని వస్తువు, కథాసంవిధానం,

పాత్రలు, శైలి వగైరాలు (రచయితల రచన సామర్థ్యానికి గీటురాళ్ళగా కాకుండా) పాఠకుల అభిరుచుల స్థాయిని అంటిపెట్టుకుని వర్థిల్లే కీచురాళ్ళగా మాత్రమే వుంటున్నాయి. జీవితానికి సన్నిహితంగా వుంటూన్నట్లు నటిస్తూ, అలా వుండకుండా పాఠకుల కోర్కెలను సంతృప్తిపరచే నల్లమందులా పనిచేస్తున్నాయి. నా అభిప్రాయం యివి కూడా ఫార్ములా రచనలమాదిరి అయిపోతున్నాయి. పెద్ద పత్రికలు వ్యాపారాభివృద్ధి కోసం రచయితలను యితోధికంగా ప్రోత్సహించే ఉద్దేశంతో కథల పోటీలు నవలల పోటీలు నిర్వహించి పెద్ద మొత్తాలను బహుమతులుగా యిస్తున్నాయి. అందుచేత రచయితలు పోటీ బహుమతులకోసం నవలలు రాస్తున్నారు. నవలవల్ల సర్క్యులేషన్ పెరగాలి అనే ధ్యేయంతో కేవలం వ్యాపారదృష్టితో బహుమతులివ్వటం జరుగుతోంది. నవలా వ్యాపార యుగంలో నిస్సందేహంగా నవలామణులదే పైచేయి. వంటలు పిండి వంటలు కుట్లుఅల్లికలు ప్రశ్నలు జవాబుల కాలమ్స్‌లోంచి రచయిత్రులు పుట్టుకొచ్చారు. నాలుగ్గోడల మధ్య సుఖదుఃఖాలు కావ్యవస్తువులైనాయి. వైయక్తికమైన బాధలు గాథలుగా వెలువడ్డాయి. ఈ సంకుచితమైన పరిధిలో కథావస్తువు దొరకనపుడు, జీవితం నుంచి ప్రేరణను పొందగలిగే శక్తిలేనపుడు, యిదివరకు తాము చదివి ఆనందించిన హిందీ బెంగాలీ నవలల్ని పేర్లుమార్చి లేబిల్ మార్చేసి తిరిగి రాయటం కొందరివంతయిపోయింది. గురజాడ అప్పారావుగారు తెలుగులో మొదటి నవల రాసివుంటే నవల చరిత్ర మరొకరకంగా వుండేదేమోనని నేననుకుంటాను.

ఆడవాళ్ళు నవలలు రాయటం నాకిష్టంలేదనికాని, వాళ్ల రచనలు నాకు గిట్టవవి కాని నేను చెప్పబోవడం లేదు. ఒకవేళ నాకు వీరి రచనలు గిట్టకపోయినా వారికి వచ్చిననష్టం ఏమీలేదు. వేల సంఖ్యలో పాఠకులు చదువుతున్నారు. వేల రూపాయలు బహుమతులుగా పుచ్చుకుంటున్నారు. ఈ ఆడకెరటం లేచి 'తెలుగు నవలను' పాతికనలభైఏళ్ల వెనక్కు నెట్టేసింది. కారణం రాసేవారి అభిరుచుల స్థాయి సాంస్కృతికంగా మనల్ని ఒక అర్థశతాబ్దం వెనక్కు తరిమేసింది. ఈపాపానికి ఒడికట్టుకున్నది తె:సో తెలియకో పత్రికలవారే.

ఆడదాన్ని, నాలుగ్గోడల మధ్య బంధించి వుంచింది మగవాడా. సాంప్రదాయం పేరిట ఆడది మన ఇళ్ళలో అర్థశతాబ్దం వెనకటి అభిరుచులు పద్ధతులతో జీవిస్తూంటే మగవాడు ఏమాత్రం ముందుకువెళ్తాడు? జీవితాన్ని వెనక్కుతిప్పెయ్య గలశక్తి సంప్రదాయానికున్నప్పుడు ఆ సంప్రదాయం ముద్దకట్టిన మూర్తులు మన స్త్రీలు. సాహిత్యాన్ని వెనక్కు నెట్టెయ్యడంలో ఆశ్చర్యం ఏముంది? మానసికంగా స్త్రీ పురుషుల మనస్తత్వాలు ఆలోచన శక్తిలోగల తేడాలవల్ల, పురుషుల ప్రపంచం స్త్రీల ప్రపంచం వేరయి

పోయింది. ఆర్థికంగా సాంఘికంగా, రాజకీయంగా యింకా మీ కభ్యంతరం లేకపోతే సాంస్కృతికంగా వెనుకబడిన స్త్రీలు. అలాటి అభిరుచులేకల పురుషులు ఎక్కువగా నేలబారు సాహిత్యం చదవటం వలన పత్రికలలో వారికోసం ప్రచురితమయే రచనల స్థాయి నేలబారుగా వుండక తప్పడంలేదు నా బాధేమిటంటే సోషలిస్టు సమాజ లక్ష్యం మాట దేవుడెరుగును. పెట్టుబడిదారీ సంస్కృతికూడా మనకబ్బలేదు. మనం యింకా ఫ్యూడల్ సంస్కారాన్ని ఆరాధించేదశలో వున్నాం. ధనిక సమాజ ఆక్షణలు మన స్త్రీలను ముక్కుపట్టుకు లాగుతున్నాయి. కోడూరి కౌసల్యాదేవి నవలలు డబ్బుచేసు కుంటున్నాయంటే. సినిమావారు ఆవిడ నవలలకోసం 'క్యూ'ల్లో నుంచుంటున్నారంటే ఫ్యూడల్ పద్ధతులు ఫ్యూడల్ సంస్కారం పట్ల ఈదేశంలో యింకా ఎంతమోజుందో మనకు తెలుస్తుంది. గతంపై మనకున్న మమకారం చావలేదు Burden of the tender part is weighing very heavier on our shoulders.

తెలుగు నవల జాతీయస్థాయికి ఎదగలేదనే బాధచేత యీ సంగతుల్ని ఏకరువు పెట్టవలసి వచ్చింది. కొన్ని వందల వేల సంవత్సరాలు గడియారాన్ని వెనక్కుత్రిప్ప గల రచయితలైతే మనకువున్నారు కాని సమాజాన్ని ముందుకు నడిపించే రచయితలు మనకు లేరనుకాని తక్కువగా వున్నారు. ఒక గోర్కీకాని ఒక మపాసాకాని ఒక చెఖోవ్‌కాని ఒక డాస్టవిస్కీకాని మనకి ఎందుకులేరు?

ఇప్పుడున్న వ్యవస్థలో ముఖ్యంగా ఈ సమాజంలో అటువంటి రచయితలు పుట్టడానికి ఎక్కువ అవకాశంలేనట్లు కనిపిస్తోంది కాని యిదే పుట్టవలసిన సమయం. గత వైభవాన్ని కీర్తించినవాళ్ళు జ్ఞానపీఠం అవార్డులు పుచ్చుకుంటున్నారు. రేపటి సమాజం కోసం తిరగబడి పోరాడుదాం అంటున్నవాళ్లు ఉరికంబా లెక్కుతున్నారు. నైతికంగా సాంస్కృతికంగా దివాళాతీసిన జాతి మనది. ఈదేశంలో ఎన్నికలు కలవారి వినోదం. పదవులకోసమే రాజకీయాలు. 'వెంకటేశ్వర వైభవం' నూర్రోజుల పండుగ చేసుకొంటున్న ఈదేశంలో 'సమసమాజస్థాపన' ఎంతవరకు సాధ్యం 'దసరాబుల్లోడు' రెండువందల రోజులకు పైగాచూసిన తెలుగు ప్రజలు 'అన్నిందాలా' మోసగింపబడ టానికి ఎప్పుడూ రడీగావుంటారు. సీరియల్ నవల అనేది పత్రికలవారూ రచయి తలూ చిత్రికారులూ కలిసిచేసే 'మాయా - మోసం - మిధ్య' వంటిది అంటే మనకు బాగా బోధపడుతుందనుకుంటాను.

జర్నలిజంతో నవలకు సంబంధం ఏర్పడిన తరువాత దాని రూపురేఖలు మారి పోయాయి. ఎవరైనా ఒకరకమైన సీరియస్ రచనచేసి తెచ్చినపుడు 'అయ్యా యిది పత్రికలో బావుండదుగాని పుస్తకంగా చాలా బావుంటుంది' అని మనం సలహాయిస్తూ

వుంటాము. అంటే పత్రిక మార్కెట్‌కు సంబంధించినంతవరకూ పాఠకుల అభిరుచుల స్థాయిని అందుకోలేని రచన ఎంత గొప్పదైనా ఎంత కష్టించిరాసినా మనకక్కర్లేదని తాత్పర్యం. ఈ కండిషనింగ్ రచయితలమీద పనిచేస్తుంది. మినిమం గ్యారంటీతో మూసపోసినట్లు ఒకేరకం రచనలు రావటానికి యీ 'కండిషనింగే' కారణం. ప్రచురణ కర్తలుకూడా సీరియలైజయిన నవలకు, ఎక్కువ పారితోషికం యిస్తారు. 'డైరక్టు రైటింగ్'కు కొంచెం తక్కువ. యితరత్రా ప్రసిద్ధులు కాకపోతే. 'కౌసల్యాదేవి, రంగనాయకమ్మ, సులోచనారాణి', పత్రికల ద్వారా పైకొచ్చిన వారే। జర్నలిస్టులే వీరిని రచయిత్రులుగా తయారుచేసింది. వీరి నవలలన్నీ పత్రికలలో ప్రచురితమైనవే.

అమెరికా బ్రిటన్ ఫ్రాన్స్ దేశాలలోవలె అంతర్జతీయ స్థాయిలో స్త్రీ విమోచనోద్యమం మన దేశంలో ప్రారంభంకాలేదు కాని దానికి కావలసిన బీజాలు రంగనాయకమ్మగారి రచనల్లో పుష్కలంగా వున్నాయి. మన దేశంలో ఫెమినిస్టు ఉద్యమం లేదుగాని వుందనుకుంటే 'స్త్రీల సాంఘిక ప్రతిపత్తి' కొరకై పోరాడే రచయిత్రిగా ఆవిడకు గౌరవస్థానం లభిస్తుంది. పురుషులలో దయాదాక్షిణ్యాలు మంచి తనం పెరిగితే వరకట్నాలతోసహా స్త్రీల సమస్యలన్నీ పరిష్కారమవుతాయని కలలు కనే రచయిత్రులుంటే వారి అజ్ఞానానికి మనం చింతించ వలసిందే. లేదా పితృస్వామికం పైదొలగి మాతృస్వామికం పునః ప్రతిష్ఠిత మవుతుందనే భ్రమ లెవరికైనావుంటే వారినిచూసి మనం జాలిపడాల్సిందే।

మొత్తానికి రంగనాయకమ్మగారి రచనల్లో 'సోషల్ప్రొటెస్ట్' ప్రధానాంశం. ఆవిడ యాంగ్రీయంగ్‌విమెన్ కోవకు చెందుతుంది. ఆవిడ శైలిసంభాషణలు పాత్రలు straight గా వుంటాయి. ఆవేశం ఎక్కువగానూ అనాలిసిస్ బొత్తిగా పూజ్యంగానూ వుంటుంది. కాలమూ స్థలమూ వాతావరణమూ యీ మూడూ సరిగా కలియవు. పాఠకులకి 'కరైన్ లెక్చర్స్' యిస్తారీవిడ. బాగో ఓగో, మంచో చెడో, వున్నమార్కెట్‌ని దృష్టిలోపెట్టుకుని దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలనే ఇల్లాంగ్ర దృక్పథంతో డజనుకుపైగా నోవెల్స్ రాసేశారు. కీర్తినుంచి అహంకారం, అజ్ఞానంనుంచి ధైర్యం లేకపోతే యిన్ని నవలలు రాయటం సామాన్య గృహిణికి సాధ్యమయే విషయం కాదు.

రాజాలు, జమీందారీలు, రాజమాతలు, వృద్ధసేవకులూ, జనావాలూ, అంతఃపురాలతో యీ స్పేస్ యుగంలోకూడా ఫ్యూడల్ కంపుకొట్టే కుళ్లు సంస్కృతినీ ఆచార వ్యవహారాలనీ, మనుష్యులనీ ఎత్తేసి, ధర్మాల్నీ నీతుల్నీ ఏకరువుపెడుతూ 'కల్యాణ చక్రవర్తి' పాదారవిందాల కథ విశ్రమించే కౌసల్యాదేవి నవలల్ని గురించి ఎంత తక్కువ ముచ్చటించుకుంటే అంతమంచిది. ప్లేగు మశూచికం కలరా మొదలైన

అంటు వ్యాధులు ఎంత ప్రమాదకరమో, ఈవిధ నవలలు ప్రజల ఆరోగ్యానికి అంత ప్రమాదకరములు. ఇంతకంటె డిటెక్టివ్ నవలలు, క్రయింత్రిల్లర్స్, సెక్సు నవలలు చదువుకోవటం మంచిదని నా ఉద్దేశం.

తెలుగు పాఠకుల ఇలవేల్పు, సస్పెన్సు రాణి, ఒకేవిధంగా జనాన్ని ఆకర్షించేలా రాయగల రచయిత్రి సులోచనారాణి ఈ శైలి మనోజ్ఞంగా హాయిగా వుంటుంది. విరహం, వియోగం, మళ్లీవిరహం, మళ్లీవియోగం, యిలా నవలంతా పూర్తయినా కథానాయికి భుజంమీద కథానాయకుడు చెయ్యి వెయ్యడు. ఆవిడ అల్లంత దూరానే వుంచుతుంది. తెలుగు పాఠకులకు యింతకంటె ఏం కావాలి? ప్రేమకథలకు రాణి యద్దనపూడి సులోచనారాణి.

సీరియల్ నవల అనగా ఒకవిధంగా పాప్యులర్ నవల ఒక నవల ప్రజాదరణ పొందటానికి పూర్వం ఎక్కువకాలం పట్టేది. ఇప్పుడు వారం వారం రాస్తూండగానే పాఠకులు పత్రిక కొని చదివి ఆనందించి అభిప్రాయాలు వ్యక్తం చేయకలుగుతున్నారు. కాని ఒకమోస్తరుగా కొన్ని ఉన్నత ప్రమాణాలను దృష్టిలోపెట్టుకుని కొత్తప్రయోగా లను చేసేవారికికాని, నాలుగ్గోడల మధ్య కుటుంబపరిధిలోని ఇతివృత్తాలనుంచి బయట పడి విశాలమైన జీవితపు లోతులను తరిచి classical గా రాసే రచనలకు ఆదరణ అంతగా లభించటంలేదు, చెత్తను ప్రోత్సహిస్తే చేత్తేవస్తుంది. మనుష్యుల దృక్పథాన్ని విశాలంచేసే రచనలు, తీవ్రమైన సమస్యల జోలికిపోయే రచనలు, పాఠకులకి అంతగా పట్టడంలేదు. మన మధ్యతరగతి మందహాసుల అభిరుచుల స్థాయి 'చందమామ' కు 'ప్రభవీక్లీ' స్థాయికి మధ్యగా వుంటున్నది. అభూతకల్పనలు, ఊహాలోకపు గమ్మత్తులు, సెంటిమెంట్లుగల నవలలు నచ్చినట్లు విజాయిటీతో ఆలోచనలను రేకెత్తింపచేసే రచనలు నచ్చటంలేదు. The customer is not always right.

ఇప్పుడు దేశంలో అసమానతలున్నాయి, దారిద్ర్యంవుంది, ఎకానమీకి ఎదు రుగా కవుంటర్ ఎకానమీ నడుస్తోంది. ప్రాంతీయాభిమానాలు కులాభిమానాలు ఎన్నికల పుణ్యమాఅని ప్రాణంపోసుకుంటున్నాయి, నిరుద్యోగ సమస్య యువతరాన్ని భూతంలా పీడిస్తోంది. ఈ కల్లోల ప్రపంచంలో మనిషి మనుగడే ప్రమాదంలో పడింది. ఇటు వంటప్పుడు 'ప్రేమ' ఒక్కటేనా మనకి ముఖ్యం? మన ఆడవాళ్లు ప్రేమ కథలుతప్ప రాయరు, చదవరు. పడవకార్లు, ఉద్యానవనాలు, పిక్నిక్కులు, దివ్యభవ్యహర్మ్య రాజాలు, ఏడడుగుల కథానాయకుడ్నితప్ప వరించరు. కథానాయిక నోరు ఎప్పుడూ 'సున్నా' లాగే వుంటుంది, వైయక్తికమైన కామవికారాలన్నింటినీ కాగితంమీద తీర్చు కోవడం నవల రాయటమైతే మన నవలకు ఏమీ భవిష్యత్తు ఉన్నట్లు కనిపించదు.

అమెరికా బ్రిటన్‌వంటి అభివృద్ధిచెందిన దేశాలలో 'నవలాయుగం పరిసమాప్తి' చెందిందని అంటున్నారు. మన తెలుగులో నవలాయుగం యిప్పుడిప్పుడే పుంజుకొంటూవుంది. సాంఘికచైతన్యంతో బాధ్యతాయుతంగా రాస్తున్నవారులేకపోలేదు. పోరంకి దక్షిణామూర్తి (వెలుగూ—వెన్నెలా— గోదారీ ఫేమ్) దాశరథి రంగాచార్య (చిల్లర దేవుళ్ళు), బీనాదేవి (హేంగ్‌మిక్విక — పుణ్యభూమీ కళ్ళుతెరు), ఎస్. ఆర్. నంది (నైమిశారణ్యం), అంగర వెంకట కృష్ణారావు (విరామం), రాచకొండ (రాజూ-మహిషీ), కొమ్మూరి వేణుగోపాలరావు (ఈ దేశంలో ఒకభాగమిది), కొలిపాక రమామణి (వెన్నెలలో పిల్లనగ్రోవి), పద్మరాజు (రామరాజ్యానికి రహదారి), ఆదివిష్ణు (సగటు మనిషి), పెద్దిభొట్ల సుబ్బరామయ్య (ధ్రువతార), సూర్యప్రకాశరావు (జీవనగంగ), రంగనాయకమ్మ (బలిపీఠం), రావూరి భరద్వాజ (పాకుడురాళ్ళు), పోలాప్రగడ (దీపశిఖ), బలివాడ కాంతారావు (దగాపడిన తమ్ముడు), భాస్కరభట్ల కృష్ణారావు (వెల్లువలో పూచిక పుల్లలు), యివి పత్రికా ముఖంగా వెలువడిన ఉత్తమశ్రేణి రచనలలో కొన్ని. మనిషిగా రచయిత ఎదగాలి. ఎదగడానికి పనికొచ్చే రచనలన్నీ మంచివే. అలా కానివి ఎవరు రాసినా ఎంతమంది చదివినా ఎంతడబ్బు చేసుకున్నా పనికిరానివాటికిందే లెక్క.

రాయాలనే కుతితప్ప మరింకేమీలేని bad writers వున్నారు తెలుగులో. వారి రచనలు బాగులేవన్నవారిమీద కారమ్మూ మిరియమ్మూ నూరటం తప్ప వారికింకేమీ చేత కాదు. పాఠకలోకాన్ని పాతాళానికి తీసుకెళ్ళే రైటర్సు వీళ్లు. వీరు రాసేదంతా అయోమయం.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆంధ్రపత్ర వీక్లీల దయవలన హారిబుల్ రైటర్సు పుట్టుకొచ్చి చార్లీపోర్క్‌తో ముట్టుకోడానికి కూడా వీల్లేని రచనలు అందమైన గెటప్‌తో మార్కెట్లోకొచ్చేలా చేశారు. కొందరికి గెట్‌క్విక్‌రిచ్ జబ్బుపట్టుకుంటే రచయితల్లో చాలా మందికి గెట్‌క్విక్ ఫేమస్— పేరాశివాలి అనే జబ్బు పట్టుకుంది. జాతికి విస్పష్టమైన లక్ష్యం ఏదీలేనపుడు స్తబ్దతలోవున్నపుడు యిలాటి కుక్కమూతిపిందెలే పుట్టుకొస్తాయి. దీనర్థం ఏమిటంటే మధ్యతరగతి కూడా పతనమయింది. మధ్యతరగతి మేధావులు కూడా పతనమై పోతున్నారు. సాంఘిక విప్లవంలో అంతర్భాగంగా ఒక సాంస్కృతిక విప్లవం మన దేశమంతటా రావలసివుంది. పై వర్గాల సంస్కృతిని మొత్తం జాతి సంస్కృతిగా రుద్దుతున్నారు. ఇది అంగీకరించటానికి వీల్లేదు.

క్రిందివర్గం ప్రజల సంస్కృతికి గుర్తింపు అంటూ యింకా ఏదీ ఏర్పడలేదు. కోట్ల సంఖ్యలో ప్రజలు అక్షరజ్ఞానం లేక అజ్ఞానంలో మ్రగ్గుతున్నారు. వీరు మనుష్యులు కారా? వీరి జీవితాలకు ఏమీ అర్థంలేదా? వీరి బ్రతుకులెలా వున్నాయో రచ

యితలుగా మనం పట్టించుకోనవసరం లేదా? వీరిని గురించిన కథలు చదవటానికే మన మధ్యతరగతి పాఠకులు దొర్కుంటారు.

ఓట్లకు పనికివచ్చే జంతువులా సామాన్య ప్రజలు? సినిమాలకు డబ్బులిచ్చే ప్రేక్షకులుగా మాత్రమే వీరికి గుర్తింపువున్నది. పీడితులని నిర్భాగ్యులని మనం రిఫర్ చేసే యీకోట్లాది ప్రజలలోంచి కూడా నిజమైన రచయితలు పుట్టినపుడు కాని మనకు గోర్కీలాటి రచయితలు వచ్చే అవకాశంలేదు. మనం మిడిల్‌క్లాసు వాళ్ళం. పెద్ద దొంగలచాటు చిన్నదొంగలం. మార్క్సిస్టు పరిభాషలో పెట్టీ బూర్జువాలం మనవర్గ స్వభావాన్ననుసరించి, నశించిపోవలసిన, లేదా విధిగా మారవలసిన సంస్కృతిని రక్షించుకునేందుకు ఎన్నిపాట్లైనా పడతాం. క్రిందివర్గం ప్రజలు మేలుకున్ననాడు ఈ ప్రభుత్వాలిలా వుండవు. ఈ నవలలూ పత్రికలూ సినిమాలు యిలా వుండవు. వుండటానికి వీల్లేనిరోజు వస్తుందని నమ్ముతూన్నాను.

---


ఈ తరం గుండెలు
ప్రజలు కళలుగా కళలు ప్రజలుగా
ఒక్కసారిగా లేస్తాయి
అని యీనాటి చరిత్ర మలుపులోనిలిచి నినదిస్తున్నయి

ధార
కవితా సంకలనం

సంకలనం: యం. నరసింగరావు

ప్రచురణ: ఆర్ట్ లవర్స్

ఇంకా ఆలోచిస్తారు. ఆలాపిస్తారు. మేల్కొల్పుతారు. ఉత్తేజ పరుస్తారు.
ఈ యుగానికి అర్థంచెప్పి—ప్రజల గుండెల్లో మార్మోగుతారు.
రేపు పొలాల్లో విశ్వవిద్యాలయాల్లో జన్మిస్తారు.

ప్రతులకు: 2/32, ఆర్ట్ లవర్స్,
ఓల్డ్ అల్వాల, సికిందరాబాదు-10

వెల: ఒక రూపాయి

ప్రతులకోసం సృజనకుకూడ రాయవచ్చు.


---

## బాంగ్లా ప్రజలకు బహిరంగ లేఖ

కామ్రేడ్స్
ప్రపంచం ఇవాళ
మీ త్యాగదీపాల వెలుగులో
పులకించి మైమరచి సోలిసోలి పోతున్నది
ఎందుకో నాహృదయం భయంతో కృంగిపోతున్నది

నన్ను మాటాడనివ్వండి
మీ రక్తారుణ నేత్రాల కాంతుల్ని
నియంత దుర్మార్గాన్ని
చిట్టగాంగ్ వీధుల్లో చెండాడిన
మీ తుపాకుల జీవన రావాన్ని నన్ను పలకనీండి

బూటకపు ఎన్నికల నాటకానికి తెరదించి
మతసర్పం విషకోరల బంధనాల్ని తెంచి
గాయాల్నీ నొప్పుల్నీ ఆకలి దప్పుల్నీ
గాలికీ నెలమేళ్లకీ వొదిలేసి
సర్వస్వం వొడ్డి సాయుధులై పోరాడిన యోధులారా
లాల్‌సలామ్ లాల్‌సలామ్ లాల్‌సలామ్

స్వార్థం భయకంపిత హస్తాల్లోనే
మీస్వప్నం ఆవిష్కరింపబడింది
ఇంటిమీది దేగకాళ్లు విరిచారుగాని
వాకిళ్లలో పొంచివున్న రాబందు సంతానాన్ని మరవకండి

మీ కన్నీళ్లు తుడిచే చేతివేళ్లను పరిశీలించండి
దోపిడీ వ్యతిరేక పోరాట శక్తుల్ని
అవి ఎందుకు పొట్టన పెట్టుకుంటున్నాయో

గట్టుచేర్చిన ప్రజాస్వామ్య నావికుల్ని చెప్పమనండి
సొంత దేశంలో ఎరుపు గీతాల గొంతుల్లో
ఎన్నెన్ని క్రూరకృత్యాల నిప్పుల్ని కుమ్మరించారో

నన్నెలా నమ్మమంటారు
నాకన్నా మీరు సుఖంగా వుంటారని
నన్నెలా చెప్పమంటారు
నా ఊపిరికన్నా భిన్నంగా మీరు ఊరేగుతారని
నన్నెలా పాడమంటారు
ఉరికంబం ఉచ్చులో వున్న గొంతుకలో స్వేచ్ఛాగీతాల్ని

మా తండ్రులుకూడా మీలాగే
తలలిచ్చి తెచ్చిన స్వాతంత్ర్యం
కొందరికే అందిందన్న భయంకర వాస్తవం
నన్నీ గీతం రాయిస్తోంది

బంధుమిత్రుల కుళ్లిన శవాల గుట్టలమీంచి
కొనవూపిరితో లుకలుక లాడుతున్న
నరికేసిన అన్నదమ్ముల మొండాలమీంచి
మానభంగాలతో ప్రాణాలు విడిచిన
అక్కా చెల్లెళ్ల రక్తాంగాల మీంచి
స్తనాలు కోయబడ్డ మాతృశ్రీల ఆర్తనాదాలలోంచి
బయినెట్ల పోట్లతో చెరచబడ్డ
కన్నెపిల్లల నెత్తుటి కన్నీళ్లలోంచి
కాష్టాల్లా కాల్చబడ్డ
నిరుపేదల శిథిల గృహాలలోంచి
శ్మశాన వాటికలైన
వీధుల విద్యాలయాల విషాదగాథలలోంచి
మిగిలిన ప్రతిరక్తపు కణంలోంచి
ఒకే కేక ఒకే అగ్ని ఒకే శక్తి జనించాలి
అది సమతా జనతా రాజ్య స్థాపన

సామ్యవాద వసంతాన్ని జపిస్తోన్న కొంగల
జీవకారుణ్య నయగారాలకు బలికాకండి
మా గుండెల్లా మీవి పొగచూరగూడదు
చరిత్ర పునరావృతం కాగూడదు
గెరిల్లా నేస్తాల్లారా నా కవితా హస్తం అందుకోండి
వేయికళ్లతో వెలుగుండగానే ఇల్లు చక్కబెట్టుకోండి
చిరునామాల్లేని అరుణామర వీరుల త్యాగపత్రంమీద
నా సంతకంగా పంపుతున్నా నీలేఖ అందుకోండి.

—చెరబండరాజు

## మంత్రదండం

ఒకడు పడుకున్నాడు
పేవ్‌మెంట్ మీద దిసమొల్తో పడున్నాడు
పస్తువిస్తట్లో ఎముకల కరకరల కౌగిట్లోపడున్నాడు

ఒకడు రిక్షా తొక్కుతున్నాడు
ఊపిరిని తొక్కుతున్నాడు
కుమ్మరి మట్టిని తొక్కినట్టు
తనకాళ్ళతోనే
తన కాళ్ళనీ చేతుల్నీ గుండెల్నీ
పిండిపిండయ్యేట్టు తొక్కుతున్నాడు

ఒకడు ఆడవాళ్లని పడుకోబెడుతున్నాడు
లేవగానే అంగాలమీద ఇల్లంతా అన్నాలు తింటున్నారు

ఒకడు బస్సుల్నీ రైళ్లనీ దారుల్నికాస్తున్నాడు
రకరకాల జేబుల్ని బ్లేడ్లతో పలకరిస్తున్నాడు

ఒకడు దుర్మార్గుడు హంతకుడు
సారాకి బదులు పచ్చినెత్తురు తాగుతాడు
ఒక ఇనస్పెక్టర్ బొజ్జలోకి అర్ధరాత్రి కత్తిదించాడు

వీళ్ళందర్నీ ఆదుకోడానికీ అనునయించడానికీ
చేతులుసాచి జైళ్లూ కోర్టులూ ఇకిలిస్తున్నాయి

వీళ్ల బతుకులమీంచి నడవడానికి
కొంతమందికి కార్లున్నాయి
పదవులున్నాయి
సిద్ధాంతాలున్నాయి
ఉపన్యాసాలివ్వడానికి నోళ్ళున్నాయి
వీళ్ళకి చూపించడానికి స్వర్గంవుంది నరకంవుంది
పాపం వుంది పుణ్యం వుంది
మోక్షం వుంది

'మేంచేసిన నేరమేమి'టని
ఏ గొంతన్నా అమాయికంగా అడిగితే
పీక తీసెయ్యడానికి
శరీరాల్ని జైళ్లలో శిలలుగా మార్చెయ్యడానికి
వాళ్ళదగ్గర రాజ్యాంగమనే మంత్రిదండం వుంది
జాగ్రత్త.

—నగ్నముని

# కవి

గరికతిన్న గాడిద చస్తుంది
గరిక బతుకుతుంది

జైళ్ళు కట్టినవాళ్ళని, రూల్సురాసిన వాళ్ళని
మానవజాతి చిరకాలంనుంచీ ఎరుగును
రాష్ట్రాలు పాలించినవాళ్ళని
రాజసం వెలిగించినవాళ్ళని
మానవజాతి చిరకాలంనుంచీ ఎరుగును

రాజులకి కిరీటం వుంటుంది
మంత్రికి పోలీసు బందోబస్తువుంటుంది
అధికారానికి అహంకారం వుంటుంది
వాళ్ళందరికీ గుర్తులున్నాయి
మనిషిగా వుండడం ఒకటే కవికిగుర్తు
మనుషులకోసం రాయడం ఒకటే కవికిగుర్తు

రాజులు పుడతారు, చస్తారు
అధికారం వుంటుంది, వూడుతుంది
కవి
పుడతాడు
చావడు

కవిని జైల్లోపెట్టిన రాజుపోతాడు
కవి వుంటాడు
మనుషులున్నాళ్లూ

— వారా

## ప్రభుత్వ కవి: ప్రజల కవి.

ఆకవిని ప్రభుత్వం, తన చేతులతో
దేశం తలమీద నిలబెడుతుంది-

ఈ కవిని ప్రజలు, తమ గుండెలతో
కాలపు జీవనాడిగా నిలబెడతారు-

ఆకవికి ప్రభుత్వ సన్మానాలు
ప్రయోజనార్థులైన ప్రముఖుల ఆశ్రయాలు
ఆయన పరిభాషలో సన్మానమంటే
డబ్బు! డబ్బు! డబ్బు!

ఈ కవిని ప్రజలే ఆరాధిస్తారు
భావాల్ని కోరి ఈయన్ని కొలుస్తారు
ఈయన దృష్టిలో ఎప్పుడూ
ప్రజలు! ప్రజలు! ప్రజలు!

ఆ కవి ప్రజల్ని, ముందుకళ్ళు తీసి వెనక అతికించుకోమంటాడు
ప్రజలు వెనక్కి తిరిగి ఉంటే ప్రభువులు నిర్భయంగా ముందుకుపోవచ్చు
కాబట్టి ప్రభుత్వం ఆ కవికి పల్లకీ పడుతుంది-

ఈ కవి ప్రజల్ని 'పదండి ముందుకు' అంటాడు
కాలమెప్పుడూ ముందుకుపోయే శీలం కలది
కాబట్టి ప్రజలు ఈ కవికి ఆత్మనర్పిస్తారు-

ఆ కవి ప్రస్తుత రాజకీయాలు పట్టించుకోవద్దంటాడు
అలౌకిక విషయాలే పట్టించుకోమని కుహనా బోధ చేస్తాడు
ప్రభుత్వానికి, ప్రజలు తమ చేతలకి దూరంగా ఉండటమేకావాలి
అందుకే ప్రభుత్వం ఆ కవిని రాజకీయంగా, లౌకికంగా సుఖపెడుతుంది-

ఈ కవి చుట్టూ ఉన్న సమాజాన్ని పట్టించుకోమంటాడు
అలౌకిక విషయాల బోధన దోపిడీకుపయోగిస్తోంది చూడమంటాడు
ప్రజలకెప్పుడూ ఐహికంగా సుఖపడ్డమే ముందున్న సమస్య
అందుకే ప్రజలు ఈ కవిని అనుసరించి ఆనంద పడతారు-

ఆ కవి సమాజంలో మిగిలిపోయిన ప్రాచీనతకి బరామీటరు

ఈ కవి ప్రజల్లో రగిలిపోతున్న జ్వరానికి ధర్మామీటరు

ప్రజల్ని ప్రభుత్వం అణుస్తుంది
అందుకని ప్రజల్ని అణిచే కవిత్వాన్ని పోషించుకుంటుంది-
ప్రజలు ప్రభుత్వాన్ని ఎదుర్కొంటారు
అందుకని ప్రజల్ని సమర్థించే కవిత్వాన్ని రక్షించుకుంటారు-

— అద్దేపల్లి రామమోహనరావు

## వర్తమాన కవి హృదయం

ఎవరు మీరు?
ఎందుకిలా వెంబడిస్తున్నారు
నీడలా?
నా నీడలా?
ఎందుకిలా వెంబడిస్తున్నారు
ఏమి కావాలి మీకు
ధనమా? ధాన్యమా?
రెండూ లేవు
ఏమికావాలి మీకు?

కలముంది
పేదల కన్నీటితో సిరా నింపిన కలముంది
కవితలున్నవి

దేశములోని దారిద్ర్యానికి, వర్గతారతమ్యాలకు
కారకు లెవరో తెలిపే
కవితలున్నవి,
చదువుతారా?

తెల్ల కాగితాలున్నవి.
నాదగ్గర లేని హింస వుందనిచెప్పి
వున్న దేశభక్తి లేదనిచెప్పి
అబద్ధాలు వ్రాసి
ప్రభుత్వంతో ప్రమోషన్ పొందటానికి
తెల్ల కాగితాలున్నాయి
వ్రాస్తారా?

ఏమి కావాలి మీకు
ఎందుకిలా వెంబడిస్తున్నారు
మీరు అనుమానపడే వస్తువులేమి నాదగ్గరలేవు
ఏమి కావాలి మీకు
బాంబులున్నాయనే అనుమానమా?
బాంబులా పనిచేసే కవితలున్నాయి
బాంబెందుకు?
పిస్తోళ్ళా?
నాదగ్గరెందుకుంటాయి?
భయస్తుల ఒడిలో పిస్తోళ్ల నివాసము
భయపడే మీ యజమానులచుట్టూ పహరా
కాస్తున్నాయి పిస్తోళ్ళు
కత్తులా? గొడ్డళ్ళా?
కలమే నా ఆయుధమైనపుడు
కత్తులెందుకు! గొడ్డళ్లెందుకు?

హింస నా లక్ష్యంకాదు
సమాజంలో హింసకు గురయ్యేవర్గాలగూర్చి
కన్నీరుకార్చే నేను హింసించగలనా?

మీలోని,
మీరు కాచే పెత్తందారులలోని
మీ యజమానులలోని,
నా చుట్టూవున్న సమాజములోని
నీచాన్ని, అవినీతిని గర్హించే నన్ను
వెంటడిస్తున్నారెందుకు మీరు?
నీతిని న్యాయాన్ని స్థాపిస్తాననేవారు
విమర్శక స్థానములోని నన్నుచూచి
భయపడుతారెందుకు?

— మధు

## అంతే

ఎడారిలో విప్లవం జనించదు
ఎండకన్నెరుగని మనుషుల్లో
ఆకలి, ఆవేదన, ఆక్రందన
పీడన, తాడన పీల్చి పిప్పిచేస్తే
ఆలోచనలు రేకెత్తిస్తే
ఓ సామ్యవాద సిద్ధాంతబలం
గుండెల్లో గుచ్చుకొంటే
తుపాకి చేతబట్టి
తుదికంటా పోరాడేందుకు
తుకతుక లాడుతూ
సర్వసన్నద్ధుడౌతాడు.

అంతే

ఎడారిలో విప్లవం పరుగెత్తదు
బండ చాకిరి హృదయాల్లో
లజ్జ, కోపం, భయం
అలసత, అవమానం, అమాంతం కొరికి నమిలేస్తే
అసమానత పేర్రేపిస్తే
ఓ సామ్యవాద రాజకీయ వాదితోడై
ధైర్యాన్ని ఉసి కొల్పితే
తుపాకి చేతబట్టి
తుదికంటా పోరాడేందుకు
తుకతుక లాడుతు
సర్వ సంసిద్ధుడౌతాడు. అంతే

ఎడారిలో విప్లవం మొలవదు
ఎండబారిన దేహాల్లో
ఏడ్పు, చలిగాడ్పు, వడగాడ్పు
ఎదమాడ్పు, వ్యధకాల్పు రగిలి రక్కుతుంటే
బాధలు గాథలైతే
జగతి చారిత్రిక భౌతిక సిద్ధాంతినీడై
వెన్నుదట్టి వెంటనడిపిస్తే
తుపాకి చేతబట్టి
తుదికంటా పోరాడేందుకు
తుకతుక లాడుతూ
సర్వసన్నాహుడౌతాడు. అంతే

ఎడారిలో విప్లవం ఊరదు
నిదర్సుఖమెరుగని నిస్సహాయునిలో
దుర్మార్గం, దురాశ, దురాలోచన
అసత్యం, అసభ్యం అవహేళన కొనఊపిరిని కుసుముతుంటే
అన్యాయం హడల గొట్టేస్తే

ఈ పెట్టుబడిదారీ భూస్వామ్య వ్యవస్థాపకుల్ని
పాలకవర్గ పైలాపచ్చీసుల్ని
తుపాకి చేతబట్టి
తుదికంటా పోరాడేందుకు
తుకతుక లాడుతూ
సర్వసమ్మెకుస్తిడౌతాడు. అంతే

—మల్లెల నారాయణ

ఏంతయున్నది ధర్మమిప్పుడు బసవన్న?
నడిమికి నొకకాలు మడచిచూపె,
దానిసతనమేది పలకరా? బసవన్న!
తల రెండు కాళ్ళలో మలచిచూపె.
సభియాలి యెటు(జూచునటుచూడు బసవన్న!
మింటి వైపుగ మోర మిట్టిచూపె(
బ్రిజవానికేది సేయవలె బసవన్న? అం
కైచైచి కాల్దివ్వి క్రీడ(జూపె...

(భారత స్వాతంత్ర్య సంగ్రామము)
— ముదిగొండ వీరభద్రమూర్తి

కథలు :

# చైతన్యం

అర్. వి. ఆనంద్

"వాణ్ణానికి లెగు" అంది దుర్గమ్మ

గుడిసె ముందు కూర్చున్న సుందర్రావుకి భార్యమాట వినపడలేదు. గుడిసెకు పదిబారల దూరంలో వున్న పిల్లకాలవవైపు చూస్తూ అతను ఏమో ఆలోచిస్తున్నాడు. రాత్రి ఏడుగంటలు కావస్తోంది. కాలవవొడ్డున కీచురాళ్లు ఎడతెరిపిలేకుండా రొదపెడుతున్నాయి. దూరంగా పొలాల్లోంచి గొడ్లకాడ కుర్రోడెవరోపాడే "చెల్లియో–చెల్లకో" గాలిని చీల్చుకుంటూ వచ్చి మధురంగా వినబడుతోంది.

"ఏంటల్లా కూకున్నావు కూడుదింటాకి లెగమంటే?" అని రెట్టించింది దుర్గమ్మ. ఉలిక్కిపడి లేచాడు సుందర్రావు. కాళ్ళమీద ముంతతో కాసినినీళ్లు గుమ్మరించుకుని గుడిసెలోకొచ్చి కూర్చున్నాడు. దుర్గమ్మ అల్యూమినియం గిన్నె అతనిముందు పెట్టింది. ఆ గిన్నెలో మూడు గుప్పిళ్ల అన్నం మెతుకులతోపాటు వేయించిన వుప్పుచేపముక్కా, నాలుగు మెత్తళ్ళూ వున్నాయి.

"ఏంట్రా అబ్బాయా, సందకాడనగా వొచ్చి మూగాదేవుడులాగ కూకుండిపోయేవు?" అని అడిగింది అతనితల్లి వరసమ్మ.

"నాకేవీ పాలుపోటం లేదమ్మా" అన్నాడు సుందర్రావు గిన్నెలో వున్న మెతుకులు కలుపుతూ.

"యేం? పెసిరెంటుగారు కూల్డబ్బులియ్యలేదా? అరికుప్ప నూర్పుళ్ళియ్యాలతో ఐపోతయ్యనుకున్నారు గందా?"

"నూర్పుళ్ళయిపోయినియ్. పదేనుబళ్ళలో దాన్నెత్తి పెసిరెంటు సావిట్లో పోసేం. కూల్డబ్బు లెల్లుండిత్తాడంట" అని ఉప్పుచేప ముక్క కొరికి, "చఛ, ఇదేంటే ఈ యెండు సేపముక్క రుసీపసీలేదు" అన్నాడు కాస్త విసుగ్గా.

"ఇంటో నూనిలేదు మరి. ఏదో అడుగూబొడుగూ వుంటే దాంతో యేపేను" అంది దుర్గమ్మ.

దుర్గమ్మ యిచ్చిన జవాబుతో అతని విసుగు మాయమైపోయింది. వెంటనే అతనిదృష్టి గుడిసెలో మూలగా ముడుచుకు పడుకునివున్న తన యిద్దరు పిల్లలమీదికి మళ్ళింది. "సత్తెమ్మా, సిన్నిగాడూ తిన్నారా?" అన్నాడు

"తిన్నార్రా బాబా.... ఏంతిన్నో. ఉన్నకాడికి ఏగెంజో తాగుదాఁవనుకుంటే ఆ గెంజే కరువైపోయింది. ఏఁవిరోజులొచ్చినియ్యిరా బగమంతుడా మీ మొగుడూపెల్లం రెక్కలు ముక్కలుజేసుకుని కష్టపడతన్నారు. ఏఁవిలాబం? పప్పుంటే వుప్పుండదు. ఉప్పుంటే పప్పుండదు. పోనీ నేనుగూడా ఆకూలిపనికెల్లి ఏదోకొంత సాయంగావుందాఁ వంటే నాకేమో సత్తువలేదు .. ఈదగ్గూ ఒగురుపూ ఒకటొచ్చిపడింది నాపేణానికి" అంటూ నరసమ్మ ఆయాసపడుతోంది.

"ఇదుగో. మాకేపన్లు సరింగా దొరక్క సత్తావుంటే నిన్ను పన్లోకెల్లమని యెవ రన్నారు? అసలిప్పుడెందుకీ సోది?" అని కోడలు విసుక్కుంది కాస్తబిగ్గరగా.

"నువ్వుండెహె" అని భార్యను గదమాయించి. "అమ్మా. నువ్వు పెద్దదాన వైపోయేవు గందా. మాకోసఁ ఏంకేం దేవుళ్ళాడతావు జెప్పు. ఏదో ఆ పిల్లల్ని దర్జీ సూసుకుంటావుంటే అంతేశాన. ఒచ్చేయేటిగ్గాకపోతే ఆపైయేటికల్లా మన సత్తెమ్మ పనుల్లోకెల్తది. అప్పుడు మనకేబాదా వుండదు" అని తల్లిని సముదాయించాడు సుంద ర్రావు. తన చిన్నతనంలో తండ్రి చనిపోయినప్పటినుంచి తల్లి ఎన్నికష్టాలుపడి తనను పెంచిందో అతనికి బాగాగుర్తు.

"ఏం బతుకులో" అని నిట్టూర్చి. "ఐతే పెసిరెంటు డబ్బులియ్యలేదన్నమాట" అంది నరసమ్మ.

"ఇయ్యలేదు. ఒకేళ యిచ్చినా ఈ నాలుగురోజుల కూలీ పన్నెండు రూపాలు ఏమూలకి సరిపోతై? కోమటి సేనయ్యకొట్లో తొమ్మిది రూపాల బాకీవున్నాం"

"ఇంకేం మిగుల్తాయి! ఇయ్యాల దురగమ్మ తెచ్చిన కూల్డబ్బుల్లో బియ్యానికీ, ఎండు పరిగిలకీ పోతే పావలా మిగిలింది"

సుందర్రావు మూడు గుప్పిళ్ళ అన్నమూ తినేశాడు. కడుపు నిండలేదు. దుర్గమ్మ మూలనున్న గెంజిదాకకోసం వెళ్ళింది. "కడుపునిండా గెంజితాగితే కొంత దుటవుగా వుంటది" అనుకున్నాడు ఆకలితీరని సుందర్రావు.

ఇంతలోనే పక్కింటి మునెయ్య కూతురు చెంద్రిమ్మ చేత్తో ముంతపట్టుకుని అక్కడికొచ్చి నిల్చుంది. "ఏఁవేపిల్లా. ఇల్లా గొచ్చేవ్?" అని అడిగింది దుర్గమ్మ. ఆమెచేతిలో గెంజిదాకవుంది.

"ఇదిగోనే.... మాయమ్మ.... కొంత గెంజుందేమో.... అడిగిరమ్మంది" అని భయపడుతూ చెప్పిందాపిల్ల.

దుర్గమ్మ దాకలోని గెంజివైపూ, భర్త ముందున్న గిన్నెవైపూ మార్చి మార్చి చూసింది. "ఈగెంజి ఒకలోటా గలాసుడుకూడా లేదు. దీన్ని ఈపిల్లకిచ్చేస్తే యింకేఁ వుంటది?" అనుకుంది మనసులో.

"అగెంజి సెంద్రమ్మ కిచ్చెయ్యి" అన్నాడు సుందర్రావు, జీవకళలేని ఆ ఎనిమిదేళ్లపిల్ల మొహాన్ని చూడగానే అతనా నిర్ణయం చేసుకున్నాడు.

"మరి నీక్యాద్దేంట్రా బాబా? నువ్వుదిన్న వాణ్ణం రొండుముద్దలైనా లేదు" అని అడిగింది తల్లి ఆదుర్దాగా.

"ఒద్దే ఈపూట నాకాకల్లేదు" అన్నాడు సుందర్రావు. దుర్గమ్మ దాకలోవున్న గెంజిని చెందిమ్మ చేతిలోవున్న ముంతలో పోసింది. చెంద్రమ్మ వెళ్ళిపోయింది.

"ఈమాత్తరం గెంజికీ నీళ్లుగలిపి ఐదుగురు తాగుతారు. అంతే ఆళ్లకీపూట అన్నఁవే లేదన్నమాట" అనుకున్నాడు సుందర్రావు లేస్తూ.

చెయ్యి కడుక్కున్నాడు. "ఒకేళ ఆ పిల్లొచ్చేటప్పుడికి గెంజిలేకపోతే ఆళ్ళంతా యీపూట కడుపులో కాళ్ళెట్టుకుని పడుకునేవోళ్లన్నమాట" అనికూడా అనుకున్నాడు ఈ ఆలోచనతో అతని మనసు మరింత చికాకుతో నిండిపోయింది.

"ఇయ్యేల్టి కెల్లాగో సదురుకున్నాం. తెల్లారితే ఏం దినాలో తెలవటం లేదు. కొంపలో ఒక్క బియ్యపగింజలేదు. కోవటి సేసయ్య అరువిత్తాడో ఇయ్యడో. ఇవ్వకపోతే ఏందింటాం?"

తల్లికి కలిగిన సందేహాలే అతనికీ కలిగాయి. ఒళ్ళెరగకుండా నిద్రిపోతున్న పిల్లలవైపు చూశాడు. ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. మాలపల్లిలో అందరిపరిస్థితీ దాదాపు ఒకేలాగవుందని అతనికితెలుసు. ఎవరికివారే తమ ఆకలితీర్చుకోవడానికి తంటాలు పడుతున్నారు.

గుడిసె దాటివచ్చాడు. నల్లని ఆకాశంలో మెరుస్తోన్న నక్షత్రాలు పిల్లకాలవలో ప్రతిఫలిస్తున్నాయి. కాలవకవతల పొలాలో నక్కలు అరుస్తున్నాయి. దూరాన ట్రంకు రోడ్డుమీద ఏదోలారీ పోతున్నశబ్దం లీలగా వినబడుతోంది.

సహదేవుడి గుడిసె దగ్గిరకొచ్చి, "సాదేవా, ఒరే సాదేవా" అని పిలిచేడు సుందర్రావు.

"లేదు మావయ్యా. రామాలయం కాడికెల్లేదు" అవి చెప్పింది సహదేవుడి భార్య ముత్యాలు.

రామాలయం ఒకటి అసలు గ్రామంలోవుంది. అదికాకుండా మాలపల్లిలో మరొక "రామాలయా"న్ని గ్రామ పెద్దల అండదండలతో "హరిజనులు" కట్టుకో వలసివచ్చింది. గ్రామంలోని రామాలయంలోకి ఈ మాలపల్లివాళ్ళెవ్వరూ వెళ్లరు.

రామాలయం వైపు నడిచేడు సుందర్రావు.

* *

"ఈ లెక్కనయితే ఈయేడు గొంతేలమ్మ పండగేం జేసుకుంటాం?" అంటు న్నాడు సుబ్బన్నతాత సుందర్రావు అక్కడికి చేరేసరికి.

సుబ్బన్నతాత రామాలయం ఎదురుగావున్న రావిచెట్టుకింద కొలువుదీర్చేడు. అతని చుట్టూ పది - పదిహేనుమంది కూర్చునివున్నారు వాళ్లలో సహదేవుడు కూడా వున్నాడు. రాత్రి పొద్దుపోయేదాకా అక్కడ కాలక్షేపం చెయ్యడం వాళ్లకలవాటు

"ఈడెక్కడ దొరికేడ్రా మనకి? కొంప అంటుకుంటంటే బీడీ యెలిగించుకునీ వోడిలాగ ఓపక్కని తింటాకి తిండిలేక యేడుత్తావుంటే గొంతేలం పొండుగంటా లంకించుకున్నాడేంటి." అన్నాడు పిల్లెంకడు.

"ఓరి నన్నాసెదవా. ఏటికోతూరైనా పండుగు సప్పల్దినొద్దేంటి? నాకు 'ఊక' దెలిసినప్పుణ్ణించి యిప్పుడుదాకా ఏయేడైనా పండుగు మానేసేవా? ఈయేడు మన కరమం యిలాగేడిసిందిగాని" అన్నాడు సుబ్బన్నతాత.

"ముసల్లమ్డికొడకా, నీకిప్పుడు పప్పులే తక్కువైనియ్" అన్నాడు పెంటయ్య వేళాకోళంగా.

దాంతో సుబ్బన్నతాతకి కాస్తకోపం వచ్చింది. "ఓరికుర్ర తత్తుకొడకా. పెద్దంతరం సిన్నంతరం లేకుండా పేలతన్నావు యెదవ సేలావన" అంటూ లేచి పెంటయ్యమీది కెళ్లబోయాడు. "అగరా పెద్దోడా ఏదో కుర్రయెదవ తెలవకన్నాడు. ఊరుకో" అంటూ కిష్టిగాడు అడ్డుతగిలాడు. సుబ్బన్నతాత గొణుక్కుంటూ కూర్చు న్నాడు

కిష్టిగాడు "దత్తుడురాజు" దగ్గిర పెద్దపాలేరు. దత్తుడురాజు అపూళ్ళోకల్లా పెద్ద భూస్వామి. కిష్టిగాడు పేదకుటుంబం నుంచి వచ్చినప్పటికీ "రాజుగారి కమతగాడు" అనిపించుకుంటూ కాస్తహోదా వెలగబెడుతున్నాడు. రోజుకూలీల కెళ్లేవాళ్ళూ, చిన్న రైతులదగ్గిర పాలేరుతనం చేసేవాళ్ళూ వాడికి సాటివాళ్ళలాగ కనిపించరు.

"కూకోరా సుందర్రావా వొణ్ణం దిన్నావా?" అంటూ పలకరించేడు సహదేవుడు సుందర్రావుని.

"వొణ్ణ(వంటే గేపకవొచ్చింది, ఒరే సాదేవా. సేసయ్య సావకారు అరువు లిత్తంలేదంట ...?" అన్నాడు ఏసుపాదం.

"ఇవ్వడంట. పొద్దున్న నేనెల్లొచ్చేను.... లచ్చ రూపాలు పూరిమీద వొడ్డీకి దిప్పుతాడుగాని మన కరువిత్తాని కేడుత్తాడు" అన్నాడు నారాయుడు.

"ఊరొదిలి పారిపోతా( వనుకున్నాడేంటి?" అన్నాడు గంగడు.

"పాపం ఆ కోపటాయన మాత్రం ఏం జేస్తాడు? అద్దవైనోళ్ళందరికీ అరువు లిచ్చేత్తే నాలుగోనాడు నెత్తిని పెంగేసుకుపోవాలి" అన్నాడు కిష్టిగాడు.

"పాపం, కిట్టయ్యమావకి సావకారంటే ఎంతజాలి" అన్నాడు నర్సిమ్మూర్తి.

"జమీందారుల్దగ్గిర కమతగాడు కదా, సావకార్లంటే ఆమాత్తరం యిదుంటాది మరి" అన్నాడు సామియేలు.

కిష్టిగాడికి కోపం వచ్చింది. "ఓరెదవసన్నర యెదవల్లారా. ఎప్పుడు జూసినా నాకుబడియేడుత్తారుగాని మీ బతుకు లిలాగున్నందు కేడవ(రేవిరా?" అన్నాడు వుక్రోషంగా.

గంగడు వుండబట్టలేకపోయాడు. "మా బతుకులకే(విరా? మేవు ఎవడిదగ్గిరా యెంగిలి నీళ్లుతాగి బతకడంలేదు. మా రెక్కల కస్టం...."

మాట పూర్తయేలోగానే కిష్టిగాడు గంగణ్ణి నమీపించి, "ఏం(ట్రా లంజాకొడకా, ఏవన్నావ్? మళ్లీఅను. మీన(వున్న మొగోడివైతే మళ్ళీఅను—" అని సవాల్ చేశాడు.

"ఒక్కసారేంటెహె? లచ్చసార్లంటాను" అని గంగడు చెబుతోండగానే సుందర్రావూ, సహదేవుడూ, ఏసుపాదం కలగజేసుకున్నారు. కిష్టిగాడికి నచ్చజెప్పి యింటికి పంపేశారు.

కిష్టిగాడు వెళ్ళిపోయింతర్వాత అంతా వాణ్ణి తలోమాటా అన్నారు.

"నాలుగేళ్ళు నోట్లోకెల్తన్నాయి మరి. ఆమాత్రం గీరుండదా ఆడికి?" అన్నాడు సుందర్రావు.

"ఒల్లొంచి పన్జేసి యెరగడు. పెద్ద పాలేర్నిగదా అని ఆళ్ళమీదా ఈళ్ళమీదా అవులుజేత్తావుంటాడు యెదవ" అన్నాడు పెంటయ్య.

"జనార్దనార్రావుగారి గేది దత్తుడిసేను కడ్డవడితే ఆళ్లపాలేర్ని బట్టుకుని దత్తుడు సావగొట్టేడు గేపకంవుందా? అప్పుడీడు దత్తుడు చేసిందాంటో తప్పేవీలేదన్జెప్పి నాతో దెబ్బలాడేడు" అన్నాడు ధర్మయ్య.

"దత్తుడాడికి దేవుడు"వు అన్నాడు సుబ్బన్నతాత.

"ఒరే ముసలోడా, నాకు తెలవకడుగుతానూ మనంవేలేకపోతే ఈదత్తుదెవర్రా?" అన్నాడు గంగడు.

"కుర్రోడివైనా మాబాగా జెప్పేవ్. నిజవేమరి. మనంలేపోతే ఈదత్తుదెవడు?" అన్నాడు సుబ్బన్నతాత గంగడిని సమర్థిస్తూ.

"ఒరే పెద్దోడా, మనకళ్ళముందు శానా యిడ్డూరాలు జరిగిపోతున్నాయి. అటిని మనం సూళ్ళేకపోతన్నాం. ఇన్నేళ్లనించి యెగసాయప్పనులో కెల్తన్నాం. మనూరి రాజులూ, కమ్మోరు మనకేవిచ్చేరు? నెత్తికి సేతులిచ్చేరు. ఆళ్ళేమో యింకా యింకా గడించుకుంటన్నారు. దత్తుడు రాజు కెక్కడెక్కడ బూవులున్నాయో ఆయినికే గేపకం వుండదు పాపం. సూరపరాజుగారికి పంచదార మిల్లులో వాటావుంది. సత్తిన్నారాయణ గారు మెడార్సెల్లి లచ్చలు పెట్టుబడెట్టి సినేంవాడీత్తన్నాడు. అసలీళ్లకీ డబ్బెక్కడదంటా? మనరెక్కల కస్టంకాదా?" అన్నాడు సుందర్రావు

"అంతేమరి" సాలోచనగా అన్నాడు సుబ్బన్నతాత.

"మనరెక్కల కస్టంగపోతే ఈ సూరపరాజుగాని దత్తుడురాజుగాని సత్తిన్నారాయణగాని ఎప్పుడన్నా దుక్కిదున్నేరా? ఊడుపూడ్సేరా?" అన్నాడు నారాయుడు

"మన పెసిరెంటు యిసినాదం మాత్తరం తక్కువ సంపాయించేడా? కాకినాడలో మేడగట్టేడు. రాజమండ్రంలో పెద్ద దుకాణవెట్టించేడు తమ్ముడిసేత" అన్నాడు సహదేవుడు.

"ఒరేయ్, అళ్ళని లచ్చాధికారుల్నిజేసి మనం వాణ్ణం మెతుకులికి మొకంవాసి పోతన్నాం. ఆళ్ళేమో మనగాలితగిల్తేనే పాపాలంటుకున్నట్టు నానాగొడవా జేత్తారు. కానీ మనవసరం లేకండా ఒక్కరోజు గడవదీమోతుబరుకి" అన్నాడు సుందర్రావు.

"అంతేమరి, తొలకరినించి మాసూళ్లదాకా చేసీది మనంవూ, అనబగించేది ఆళ్ళను. ఏంజేత్తాం? బొమ్మదేవుడు రాసినరాత తప్పదు. మనకరమంరా బాబా" అన్నాడు సుబ్బన్నతాత.

"కరమంలేదు గిరమంలేదు. నువ్వు నోరుముయ్యిరా ముసలోడా" అన్నాడు పెంటయ్య.

"అది సరేగానీ, ఒరేయ్, నాకిదిజెప్పండ్రా. మన్లో ఎవడికైనా రెండు సొక్కాయి లున్నాయా?" అని అడిగాడు సుందర్రావు.

"రెండు సొక్కాల మాటకేంగాని ఒక్క సొక్కాగూడాలేని నాబోటోళ్ళు శానా మందున్నారు" అన్నాడు ఏసుపాదం.

"సొక్కాలదాకా ఎంతుకురా? సలికాలం వొచ్చింది. పిల్లలు కప్పుకుంటాకి సరైన దుప్పటిగుడ్డ ఎంతమందికుందిరా? ... ఎప్పుడు జూసినా బేడ మంచినూనీ, బేడ వుల్లిపాయిలూ, బేడ కిర్సనాలూ తప్పితే జల్మలో ఎప్పుడైనా ఒకసేరు మంచినూని, యీసిడుల్లిపాయిలు, సేరుకిర్సనాలుకొన్న మొకాలేనా మనయ్యి? సెప్పండ్రా?" సుందర్రావు కాస్తవుద్రేకంగా అన్నాడు.

అందరూ మౌనంగా వుండిపోయారు.

"ఒరేబాబా, మనం మాలోళ్ళం. రాజుల్లాగా, కమ్మోళ్లాగా మనాదోళ్ల యిళ్లల్లో గూకుంటే మనకి జరగదురా. అందుకనే పనిదొరికిందంటే మనం మొగుడూపెళ్లాంవూ పనుల్లోకెల్లాలి ... ఏరాపెద్దోడా! ఇంతజేస్పచ్చినా మనల్ని నమ్ముకున్న పిల్లలకి కడుపు నిండా గెంజిపొయ్యలేకపోతన్నాం. ఇది ఎందువసేతంటావు?"

"పెద్దోడు" ఏమీ చెప్పలేకపోయాడు.

"అదివోపేనీగానీ నాకీసంగతి చెప్పండొరె. మన్లో ఎవడింటోనైనా యిప్పుడు అడ్డెడంటే అడ్డెడు బియ్యపగింజలు దొరుకుతయ్యా? ... సెప్పండ్రా" అన్నాడు.

"బియ్యానిక్కరువొచ్చేసిందిరానారాయనా. ఈయేడు పంట బాగా తగ్గిపోయిందంట. బియ్యంధర పెరిగిపోయిందంట. కరణంవంటన్నాడు మొన్న" అన్నాడు సుబ్బన్నతాత.

"పంటతగ్గిపోబట్టేనేంటి లారీలమీద లారీలెల్తన్నాయి బియ్యం? నీకు తెలవకపోతే టంకురోడ్డుమీదకెల్లి జూడవయ్య" అన్నాడు ధర్మయ్య.

"మన్లో ఎవడికొంపలోనూ అడ్డెడుబియ్యంలేవుగాని బియ్యంలారీలు మాత్తరం మాజోరుగాయెల్తన్నాయి" అన్నాడు గంగడు.

"అడ్డంగొడదాంరండెహేలారీల్ని. ఎవడడ్డంవొత్తాడోసూద్దారి" అన్నాడు నర్సిమ్మూర్తి వుప్పొంగే ఆవేశంతో.

అంతకుముందు రామాలయంవైపు నడిచివస్తోండగా సుందర్రావుకికూడా యిదే ఆలోచనతట్టింది. తనకుకలిగిన ఆలోచనే నర్సిమ్మూర్తికికూడా కలిగినందుకు తను ఆశ్చర్యపడ్డాడు.

"సెయ్యాలంటే సెయ్యొచ్చుగానీ తరవాత సిక్కుల్లోపడాతాఁవేమోనని కొంత యిదిగావుందిరా" అన్నాడు నారాయుడు.

"ఏసిక్కులూరాకండా అందరం ఆలోసించేసేద్దారి" అన్నాడు సామియేలు.

"అవునుమరి. కంగారుపడితే లాబంలేదు" అన్నాడు సహదేవుడు.

"ఏంట్రా? నిజంగా లారీలడ్డంగొడఁదావనే?"

అని అడిగాడు సుబ్బన్నతాత ఆదుర్దాగా.

"లేపోతే యాలాకోలఁవాడతన్నాఁవనుకున్నావా?" అన్నాడు పిల్లెంకడు.

'దొంగతనఁవెంతుకురా బాబా? తప్పుగాదంటారి?'

'ఏడిసినట్టుంది. రామాయణఁవంతాయిని రావుడికిసీతేఁవవుద్దని అడిగినట్టుయించేపూ మనంమాట్టాడుకున్నదేంటి? నువ్వు అరదంజేసుకున్నదేంటి?' అన్నాడు గంగడు.

'అరవయ్యేళ్ళొచ్చినా నీకు బుర్రిలేదురా ముసలోడా. మనం పెద్దపెద్దగరాణా దొంగల్దగ్గిర్నించి మన కూలోళ్ళకొక్కవలిసిన బియ్యందెచ్చుకుంటాఁవంతే. ఇది దొంగతనఁవెలాగవుద్ది?' అన్నాడు ఏసుపాదం.

"ఏమో మీయిస్టం. కాని జాగర్తాగా వుండాల్రా బాబా"

"నిజఁవే. జాగర్తాగా వుండాలి. మనం పరాయోళ్ళెవరికీ ఈయెవారం తెలవనివ్వకూడదు. కిట్టిగాడిలాంటోళ్ళకసలే తెలవకూడదు అన్ని యివరాలూ బాగా మాటాడుకుని. యీలు కుదిరితే రేపుమాపటికే జేసేద్దారి" అన్నాడు సుందర్రావు.

ఆ తర్వాత వాళ్లంతా తమ పథకాన్ని గురించి చర్చించుకున్నారు.

* * *

ఆ మర్నాడు రాత్రి పదిగంటల వేళ.

మాలపల్లికి దూరంగావున్న వూరు మాటుమణిగింది. పిల్లకాలవ అవతలిగట్టున నేరేడు చెట్టుకింద, దట్టమైన చీకట్లో సుందర్రావుతోపాటు దాదాపు ఏభైమంది కూర్చుని వున్నారు. అంతకు ముందురోజు రాత్రి రామాలయం దగ్గిర కలుసుకున్న వాళ్ల అతి రహస్యంగా మాలపల్లిలోని ముఖ్యమైన వాళ్ళందర్నీ కలుసుకుని, ఈనాటి సాహసానికి ఒప్పించారు.

ఇంతలోనే సుబ్బన్నతాతా, మునెయ్యా, అతని భార్య నాగమ్మా, సామియేలూ, అతని భార్య వజ్రావతీ, కూతురు సంతోషం వచ్చి వాళ్ళని కలుసుకున్నారు.

"ఆడోళ్ళెంతు కొచ్చేరు? బత్తాలు మొయ్యగల్దురేంటి? ఈ ముసలోడెంతుకు?" అన్నాడు సహదేవుడు.

"వొద్దంటే యినకుండా యెమ్మటబడ్డారు" అన్నాడు మునెయ్య.

"యేం? మాఁవురాకూడదా?" అనడిగింది నాగమ్మ.

"వొద్దు. ఎలిపోండి. పని కానాకష్టం. ఇల్లదగ్గిరుండండి. వనైతే రెండుగంటల్లో వొచ్చేత్తాం" అన్నాడు సుందర్రావు.

"జాగర్తాగా యెల్లిరండ్రా బాబా" అని వాళ్ళతో చెప్పాడు సుబ్బన్నతాత.

"ఎల్లండొలే" అన్నాడు సామియేలు. సుబ్బన్నతాతా, ఆడవాళ్లూ 'పట్టె'మీదుగా కాలవదాటి మాఁపల్లివైపు వెళ్ళిపోయారు.

"అనుకున్నోళ్లంతా వొచ్చేశారు గందా?.... జాగర్తాగా వుండాలి. ఏది ఏవైనా సరే మనగుట్టు మాత్రం బయటపెట్టగూడదు. మీ బిడ్డలమీదొట్టు" అన్నాడు సుందర్రావు.

"అలాగే" అని భరోసా యిచ్చేరు వాళ్లు.

"ఇంకా యెంతుకిక్కడ? బయదెల్దాం నడవండ్రా" అంటూ కదిలాడు మునలయ్య.

"ఒరేయ్. ఒరేయ్. అందరూగలిసి వాడపిల్లి తీర్తానికెల్లినట్టు 'హొలో' మని పోవటంకాదు పదేసి పదేసిమందిని నేనూ, సాదేవా, గంగడూ, పిల్లెంకడూ, దరమయ్యా తీసికెల్తాం. ఇదుగో! మనఁ వెల్లవాలిసిన బోటుకెల్లేదాకా ఒక్కడుగూడా కిక్కురు మనకూడదు. తెలిసిందా?" అన్నాడు సుందర్రావు.

పిల్లెంకడు పదిమందిని తీసుకుని కాలవగట్టువిడిచి మునసబు పొలాని కడ్డంపడి ట్రంకురోడ్డువైపు నడకసాగించేడు అక్కడికి ట్రంకురోడ్డు రెండు ఫర్లాంగుల దూరం వుంటుంది.

మొదటి జట్టునలా బయల్దేరనిచ్చి, సహదేవుడు మరో పదిమందితో కాలవగట్టు మీద ఒకఫర్లాంగు దూరం వెళ్ళి, సీతయ్యగారి మామిడితోటలోకి మళ్ళి ట్రంకురోడ్డు వైపు నడకసాగించేడు.

మిగతా మూడుజట్లూ వేరువేరు దారుల్లో బయల్దేరారు. మొత్తంమీద అందరూ ట్రంకు రోడ్డుమీదున్న వంతెనదగ్గిర కలుసుకున్నారు. ట్రంకురోడ్డుకి అవతలివైపు, ఆ వంతెనకి ఒక ఫర్లాంగు దూరంలో ఆవూరి మాదిగపల్లి వుంది.

సుందర్రావూ, సహదేవుడూ, గంగడూ, ధర్మయ్యా, పిల్లెంకడూ వంతెన పక్కగా నిలబడ్డారు. మిగతా జనమంతా మరికాస్త వెనక్కివెళ్ళి జనపచేను గటమీద కూర్చున్నారు. ఆ చీకట్లో వాళ్లెవరూ గమనించలేరు.

అందరూ మంత్రించినట్టు నిశ్శబ్దంగా వున్నారు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఏభై మంది చైతన్యవంతులైన పేదలు ఒకచిన్న అవకాశంకోసం ఎదురుచూస్తున్నారు.

అరగంట గడిచింది. దూరంగా హెడ్‌లైట్లు కనిపించాయి.

"సిన్నకారు" అన్నాడు ధర్మయ్య లైట్లకీ, భూమికీ మధ్యవున్న దూరాన్నిబట్టి.

"అవును" అన్నాడు సుందర్రావు. ఐదుగురూ వంతెన వెనక నక్కారు చిన్న కారు వెళ్ళిపోయింది.

మరో పావుగంటకి ఒక గవర్నమెంటు బస్సు వెళ్ళింది.

బస్సువెళ్ళిన పదినిముషాల్లో దూరంగా లారీ హెడ్‌లైట్లు కనిపించాయి శబ్దాన్ని బట్టి అది లారీయేనని వాళ్లు సులువుగా పోల్చారు. వెంటనే భుజంమీది కండువాలుతీసి, ముఖం సరిగా కనిపించకుండా చెవులమీదుగా తలపాగాలు చుట్టుకున్నారు. ఐదుగురూ రోడ్డుకడ్డంగా నిలబడ్డారు.

చేనిగట్లమీదవున్న జనం జరగబోయేదానికోసం ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు.

లారీ దగ్గరయింది. సుందర్రావు చెయ్యి అడ్డంపెట్టాడు. లారీ వాళ్లని సమీపించి ఆగింది. "ఏంటి?" అని అడిగేడు డ్రైవరు విసుగ్గా.

"బాబ్బాబు, మా యిద్దర్నీ తీసికెల్లి రావులపాలెంలో దింపెయ్యి బాబు. అక్కడ మాయప్పకి పేణంమీద కొచ్చింది. డబ్బులిస్తాం బాబు" అని ప్రాధేయ పడుతున్నాడు సహదేవుడు. ఈలోపుగానే గంగడు లారీని చుట్టివచ్చి అది బియ్యం లారీయేనని నిర్ధారణ చేసుకుని సన్నగా యీలవేశాడు. చేనిగట్లమీదున్న జనం మాటా పలుకూ లేకుండా బయల్దేరి రోడ్డెక్కారు.

"సోట్లేదు" అని నిర్లక్ష్యంగా చెప్పబోతున్న డ్రైవరు సుందర్రావు చేతిలోకత్తి చూసి బెదిరిపోయాడు ఇంతలోనే ఆతను ఎదురుగా జనాన్నిచూశాడు భయంతో వణికి పోయాడు.

"నిన్నేవీ జెయ్యం. బయపడకు" అన్నాడు సుందర్రావు

డ్రైవరు భయం కొంత తగ్గింది. "లారీని రోడ్డుపక్కగా నిలబెట్టు" అన్నాడు సుందర్రావు ఆజ్ఞాపూర్వకంగా.

ఆజ్ఞ పాలించేడు డ్రైవరు.

"ఇంజినాపై, లయిట్లారిపై".

అలాగే చేశాడు డ్రైవరు.

"దిగిరా"

డ్రైవరుదిగాడు. 'క్లీనూ, నువ్వుగూడాదిగు'

'ఏంటీదవుర్జన్యం?' అన్నాడు క్లీనరు.

'మాటాడొద్దు. నోరిప్పితే దెబ్బదింటావు'

నర్సిమ్మూర్తీ, గంగడూ, పెంటయ్యా, ఏసుపాదం డ్రైవర్నీ, క్లీనర్నీ జనప చేనుమధ్యకంటా నడిపించుకు వెళ్ళి, అక్కడకూర్చోబెట్టారు.

'ఒక పదినిమసాలుగూకోండి. తరవాతెలిపోవచ్చు' అని వాళ్ళతో అన్నాడు పెంటయ్య స్నేహపూర్వకంగా.

నారాయుడూ, సుందర్రావూ, సామియేలూ, మునెయ్యాలారీపైకెక్కి కిందున్న వాళ్ళకి బస్తాలెత్తడం మొదలెట్టారు. పీపున బస్తామోస్తూఒక్కొక్కడూ చేలకడ్డంపడి మాలపల్లివైపు నడకసాగించారు.

లారీ సగంఖాళీఅయేటప్పటికి యెదురుగా ఒక చిన్నకారువస్తోన్న సూచనలు కని పించాయి. వెంటనే జనం చేలోకితప్పుకున్నారు. ఒక్క సుందర్రావుమాత్రం లారీ డోరు తెరిచివుంచి నిద్రపోతున్నట్టు నటించేడు. కారు వెళ్ళిపోయింది. వెంటనే జనం రంగంలోకి సిద్ధమయారు ఇళ్ళకి చేరవేసినవాళ్ళలో పదిమంది అలసటనుకూడా లెక్క చెయ్యకుండా తిరిగివచ్చారు వాళ్ళంతా మూగగా గొప్ప ఆనందం పొందుతున్నారు.

అర్థరాత్రిదాటేసరికి వాళ్ళకార్యక్రమం దాదాపు ముగిసింది డ్రైవరుకీ, క్లీనరుకీ కాపలాగావున్నవాళ్లు తిరిగివచ్చారు.. వాళ్లూ, సుందర్రావూ తలకొక బస్తానూ ఎత్తుకుని బయల్దేరారు. తీసుకెళ్ళేవీలులేక వాళ్లు పదిబస్తాల్ని లారీలోనే వదిలిపేశారు.

డ్రైవరూ, క్లీనరూ మతిలేనివాళ్ళలాగ లారీదగ్గిరకి నడుచుకుంటూ వచ్చారు.

* * *

ఆరాత్రి వాళ్ళెవరూ నిద్రపోలేదు. తెచ్చుకున్న బియ్యాన్ని దాచుకోవడంతోనే ఆరాత్రంతా గడిచిపోయింది.

ఆడవాళ్లుకూడా మగవాళ్ళతోపాటు శ్రమపడ్డారు. గునపాలకీ, పార్లకీ పని తగి లింది, ఇంతజరుగుతున్నప్పటికీ కిష్టిగాడిలాంటి దళారీలకి ఏమాత్రం తెలియకుండా జాగ్రత్తపడ్డారు.

గంగడు తన వాటాకొచ్చిన బస్తాబియ్యం తనకున్న కాస్తపెరట్లోనూ గొయ్యితీసి అందులో పాతిపెట్టాడు. గోతిపైన తుక్కూదూగరాపోసి అసలక్కడ తవ్వినగుర్తులే లేకుండాచేశాడు, ఈపద్ధతి చాలామంది అవలంబించేరు.

ఏసుపాదం భార్య రూతమ్మ బియ్యం బస్తాను వంచపాళీలో పెట్టి, చుట్టూపిడకల గూడుకట్టింది.

అటకలున్న వాళ్ళు అటకపైనవేసి, బస్తా కనబడకుండా తాళ్ళు పేళ్ళు అడ్డ దిడ్డంగా పారేశారు.

సామియేలూ, నారాయుడూ, మరికొందరు తమబస్తాలు తీసుకెళ్ళి మాలపల్లి పక్కనేవున్న పోరంబోకు భూమిలో పాతిపెట్టారు.

ఎవరికివాళ్లు తీసుకోగా చివరికి పదకొండు బస్తాలు మిగిలిపోయాయి. ముఖ్య మైనవాళ్లు పదిమందీ ఆలోచించారు.

"పాపం సూసీవోళ్లూ సేసీవోళ్ళూ లేక సుబ్బనాత గిజగిజలాడిపోతన్నాడు. ఆడికి మనం వాటాయివ్వాలి" అన్నాడు నర్సిమ్మూర్తి.

"మరి మన మేస్టరమ్మ క్రుపావతమ్మకి, పాపం, మూడు మాసాల్నించి జీతా ల్లేవు. ఆతల్లి సంగతిగూడా మనంవాలోసించాలి" అన్నాడు పిల్లెంకడు.

వాళ్ళిద్దరికీ చెరోబస్తా కేటాయించాలని నిర్ణయించారు.

"ఈ మిగిలిపోయిన బత్తాలు దరమయ్య సేలోదాయాలి" అన్నాడు సుందర్రావు. ధర్మయ్యకి పూర్వీకులిచ్చిన అరెకరం భూమివుంది. అతనొక పేదరైతు.

"ఎంతుకని?" అని అడిగాడు గంగడు.

"ఎంతుకంటే.... ఒకేళ రేపు పోలీసోళ్లొచ్చి మన గుట్టుకనిపెట్టి బియ్యంవన్నీ పట్టికెళ్ళిపోతారనుకో. అప్పుడింక మనోళ్ళేం దింటార్రా? అంతుకే ఈ బత్తాలు మన వుమ్మడి సొత్తనుకుని దాసుకోవాలి. రేపు ఎటుదిరిగి ఎటొచ్చినా ఈ బత్తాలైనా మిగు ల్తాయి. ఏవంటా?" అన్నాడు సుందర్రావు.

అతను చెప్పిందాని కందరూ అంగీకరించారు. గునపాలూ, పారలూ తీసుకుని ఆ బస్తాలతో పొలం బయల్దేరారు. వాళ్ళు పొలం నుంచి తిరిగివచ్చేటప్పటికి తొలకోడి కూసింది.

* * *

తెల్లవారుతోండగా పోలీసు జీపు వంతెనదగ్గిర ఆగింది. సబిన్స్పెక్టరూ, హెడ్డూ, ఇద్దరు పోలీసులూ, లారీ డ్రైవరూ, క్లీనరూ దిగేరు.

"ఇక్కడేనండి" అంటూ ఘటన జరిగిన స్థలాన్ని చూపించాడు డ్రైవరు.

నేలమీదరాలిన బియ్యం గింజలు జరిగినదానికి సాక్ష్యంగావున్నాయి. ఏదోవస్తువు

పారేసుకున్న వాళ్ళలాగ యిద్దరు పోలీసులు ఆ చోటంతా వెదకడం మొదలుపెట్టారు.

"బస్తాలు తీసుకుని వాళ్ళెటెళ్లారు ?" అని అడిగేడు ఇనస్పెక్టరు.

"మమ్మల్నిద్దర్నీ ఆ జనుసేలో గూకోబెట్టి నలుగురు కాపలావున్నారు గదాండి. అంతుకని సీకట్లో ఆళ్ళెటెళ్ళేరో కనబళ్లేదండి" అన్నాడు డ్రైవరు.

"లారీ ఆపినవాళ్లగాని మీకు కాపలావున్నవాళ్లగాని కనిపిస్తే గుర్తుపట్టగలరా?"

"కష్టవండి" అని యిద్దరూ ఒప్పేసుకున్నారు.

"ఏడిసినట్టుంది. పోనీ వాళ్లలో ఎవడిపేరైనా మీకు తెలుసా ?"

"మాదగ్గిర కాపలావున్నా వోళ్ళల్లో ఒకడిపేరుమాత్రం గంగఁడని ఆళ్లమాటల్లో తెలిసిందండి".

"ఫరవాలేదు, ఆమాత్రమైనా జ్ఞాపకం వుందేడిసింది" అంటూ పరిశీలనగా చుట్టూ చూశాడు ఇనస్పెక్టరు, కనుచూపు మేరలో మాదిగపల్లి కనిపించింది.

జీపు మాదిగపల్లి శివార్లో ఆగింది. జీపును చూడగానే ఖంగారుపడుతూ నరిసిగాడు జీపుదగ్గిరకొచ్చి, అల్లంతదూరంలో చేతులుకట్టుకు నిలబడ్డాడు.

"నీపేరేంట్రా?" ఇనస్పెక్టరు ప్రశ్న.

"నరిసిగోణ్నండి బాబయ్యా, ఈవూరికి తలారోణ్నండె".

"గంగడు యింటో వున్నాడా ?"

"సిత్తం.... ఏ గంగడండి బాబయ్యా ?"

"ఎంతమందున్నా రేవిటి ఆ పేరుతో ?"

"ఇద్దరున్నారండె ఒకడేమో పుల్లిగాడి కొడుకండె. ఆడు సిన్నోడు. ఇంకొకడేమో కొంత పెద్దోడుండె".

"ఇద్దర్నీ తీసుకురా"

"సిత్తం సిత్తం", తలారి వెళ్ళాడు.

ఇంతలోనే లారీకీ, అందులోని సరుక్కీ యజమాని ఐన సుబ్బరాజుగారి కొడుకు క్రిష్ణంరాజు మోటార్ సైకిల్ మీద అక్కడికొచ్చేడు. 'ఏంతిడతాడో' అని డ్రైవరూ, క్లీనరూ భయం భయంగా నిలబడ్డారు. కాని అతను వాళ్ళవంక చూడనేలేదు.

"నాన్నగారు లేరాండి ?" అని సాదరంగా అడిగేడు ఇనస్పెక్టరు.

"లేరండీ, లాస్టునైట్ హైద్రాబాడెళ్ళేరు" అన్నాడు క్రిష్ణంరాజు, "మీ కబురు నాకిప్పుడే అందింది. ఇన్వెస్టిగేషన్ ఎందాకా వచ్చింది ?".

"దొరికిపోతార్లెండి వెధవలు" అని నవ్వేడు ఇనస్పెక్టరు.

'గంగడు' పేరుతోవున్న యిద్దరూ వచ్చారు ఒకడికి ఏభైఏళ్లుంటాయి. రెండో వాడికి పద్దెనిమిదేళ్లుంటాయి. ఇద్దరికీ ఒంటిమీద గోచీ, మాసిపోయిన చిరుగుల కండువా తప్ప మరేమీలేదు. భయం భయంగా దూరం దూరంగా నిలబడ్డారు చేతులు కట్టుకుని.

"వీళ్ళలో ఎవడు?" అని అడిగేడు ఇనస్పెక్టరు.

"సీకటికదాండి, ఆనమాలు దొరకటం లేదండి" అన్నారు డ్రైవరూ, క్లీనరూను. ఆ యిద్దరూ కాదేమోనని వాళ్లు మనసులో అనుకున్నారు. కాని పైకిచెప్పే ధైర్యం లేకపోయింది.

"ఏరా గంగా! ఏమాత్రం బియ్యం దొరికాయిరా?" అని అడిగేడు ఇనస్పెక్టరు ఇద్దర్నీ మార్చిమార్చిచూస్తూ. తనతెలివిమీద ఆతనికి గొప్ప నమ్మకం వుంది అందరు పోలీసువాళ్లలాగే అతనికి కూడా అంతులేని దురహంకారం వుంది.

వాళ్ళిద్దరూ అయోమయంలో పడ్డారు. "త.... తఁవురు నన్నే అడుగుతున్నారాండి?" అంటూ తడబడ్డాడు ముసలి గంగడు.

"నిన్నేరా" అంటూ మళ్ళీ యిద్దరివంకా చూశాడు ఇనస్పెక్టరు.

"ఏ బియ్యఁవండె?" అని అడిగేడు పడుచు గంగడు అమాయకంగా.

"నాటకాలాడక నిజం జెప్పెయ్యండ్రా. లేపోతే తోఖ్నాడిపోతై" అని హెడ్డు హెచ్చరించేడు.

"మ.... మాకేఁవీ తెలవదండె. నా బిడ్డలమీద పెమాణకంజేసి చెవుతున్నాను. సిన్నప్పణ్నుంచీ ఈఁవూరు రైతులికి సెప్పులు గుడతన్నాను గంగడెలాంటోడని ఏరైతునైనా అడగండయ్యగారూ" అన్నాడు ముసలి గంగడు వణికిపోతూ.

"ఊఁ. సరే.... ఒరేయ్. మీరిద్దరూ వీళ్ళ కొంపలూ, వీళ్ళచుట్టాల కొంపలూ తనిఖీ చెయ్యండి" అంటూ పోలీసు లిద్దరికీ అర్డరు జారీచేశాడు ఇనస్పెక్టరు "ఒరే తలారీ. వీళ్ళిద్దర్నీ గ్రామ చావడికి తీసుకురా" అని. "పదండి సార్" అని కిష్టంరాజుతో చెప్పి జీపుస్టార్ట్ చేశాడు.

* * *

ఆ యిద్దరు పోలీసులూ మాదిగవాళ్ల గుడిసెల్లోని కుండా మండా పగలగొట్టి, ఏమీ ఆచూకీచిక్కక గ్రామ చావడికి తిరిగొచ్చారు. ఏ గుడిసెలోనూ తవ్వెడు బియ్యం కన్నా ఎక్కువ కనిపించలేదని చెప్పేరు అయితేనేం? వాళ్లు తిరిగొచ్చేటప్పటికే హెడ్డు ఆ యిద్దరు మాదిగల ఒళ్లు హూనం చేశాడు. ఆ దెబ్బల ధాటినుంచి కోలుకోవ

డానికి వాళ్లకి కనీసం వారం రోజులు పడుతుంది. బాధతో మూలుగుతూ, భయంతో వణికిపోతూ నిలబడ్డారు వాళ్లిద్దరూ. వాళ్లని మధ్యాన్నానికి విడిచిపెట్టారు.

ఇదంతా ప్రెసిడెంటు, కరణం, మునసబుల సమక్షంలో జరిగింది.

ఆపూట పోలీసు బృందానికి మునసబు భోజనాలు ఏర్పాటుచేశాడు.

విచారించగా మాలపల్లిలో మరొక గంగడున్నాడని తెలిసింది ఇనస్పెక్టరుకి, వెంటనే కబురు పంపించేడు.

"ఆడు పోకిరీయెదవేనండి. ఆడిమీద నాకెప్పుడూ అనుమానంవేనండి" అన్నాడు కిష్టిగాడు ఒక పోలీసువాడితో.

గంగణ్ణి తీసుకొచ్చేరు. వాడు ధైర్యంగానేవున్నాడు. "అరుసూరైనాసరే నూరు ఆరైనాసరే మనగుట్టుమాత్రరం పైవోడికెవడికీ తెలవగూడదు. ఒకవేళ మన్లో ఎవడైనా పోలీసోళ్ళకి దొరికిపోతే ఆబాదేదో ఆడొక్కడే పడాలిగాని మనగుట్టుమాత్తరం జెప్ప కూడదు." సుందర్రావుమాటలు గంగడికి పదేపదే జ్ఞాపకంవొస్తున్నాయి.

ఇనస్పెక్టరుకి నాలుగుబారలదూరంలో చేతులుకట్టుకు నిలబడ్డాడు గంగడు.

"నీ పేరేంటా్రి?" ఇనస్పెక్టరు అడిగేడు.

"మైనం గంగయ్యండి."

"ఏంచేస్తూంటావు?"

"ఆదినారాయణగారి పాలేర్నండి."

"చాలా ధైర్యవంతుడివని విన్నాను!"

ఏంమాటాడాలో తెలియలేదుగంగడికి.

"దారిదోపిడీకి శిక్షఏమిటో తెలుసా?"

" ... ... ... ... ... "

"ఉరిశిక్ష" అని తనే జవాబుచెప్పేడు ఇనస్పెక్టరు. "అంచేత నిన్నరాత్రినువ్వు ఏంచేసేవో ఎవరెవరితో వెళ్ళి ఆ లారీ దోచుకున్నావో చెప్పేసెయ్యి. తప్పు ఒప్పు కుంటే యిప్పుడే విడిచిపెట్టేస్తాం"

"నాకేంవీ తెలవదు మారాజా" చాలా వినయంగాచెప్పేడు గంగడు.

"ఒరేయ్. బగారు మంచోరుగనక ఆ మాత్రిం అడుగుతున్నారు. అబద్దంవా డితే జాగర్త. మామాయింవొండేస్తాం" అని గద్దించేడు హెడ్డు.

"చెప్పెయ్యరా. అనవసరంగా దెబ్బలుతినకు" అని సలహాయిచ్చేరు ప్రెసిడెంటు మునసబు, కరణాలు.

"నిజంగా నాకేఁవీ తెలవదండె" చాలా అమాయకంగా చెప్పేడు గంగడు

లాఠీలకు పనితగిలింది. బూటుకాళ్ళతో పొట్టలోతన్నేరు. చాలా ఓపిగ్గాహింసించారు. మధ్యమధ్యలో బూతులు; "ఇప్పటికైనా చెబుతావా?" అవి ఇ-స స్పెక్టరు ప్రశ్నలు.

"నేనేపాపం యెరుగను దేవుడో" అని బాధతో గంగడి అరుపులు హింసలవల్ల కలిగేబాధ వాస్తవం. ఆకలిబాధకూడా వాస్తవమే. ఐతే హింసలవల్లకలిగే బాధ శాశ్వతంకాదు. గంగడుమాత్రం వాళ్ళకి ఏవిధమైన ఆచూకీ యివ్వలేదు

సాయంత్రం నాలుగ్గంటలైంది. ఇద్దరు పోలీసువాళ్ళు కిష్టిగాడి సహకారంతో గంగడియింటినీ. సుందర్రావు. సహదేవుడు. పిల్లెంకడు వగైరా అందరియిళ్ళనూ సోదా చేశారు. ఎక్కడావాళ్ళకి ఆచూకీ దొరకలేదు.

సొమ్మసిలి పడిపోయిన గంగణ్ణి బంధువులకు అప్పగించేరు.

ఐదుగంటలకల్లా జిల్లా పోలీసు సూపర్నెంటువచ్చేడు. సర్కిలినస్పెక్టరుకూడా ఆయనతోవున్నాడు. సూపర్నెంటు కేసు వివరాలు తెలుసుకున్నాడు. ఆయనకి డ్రైవరు మీదా, క్లీనరుమీదా అనుమానం కలిగింది. "వాళ్ళు నమ్మకస్తులే"నని కృష్ణంరాజు చెప్పినమీదట, "సరే.... ఈ వూళ్ళో మనం చెయ్యడానికేఁవుంది. పదండి. చుట్టు పక్కల వూళ్ళలో ఇన్వెస్టిగేషన్ మొదలెట్టండి" అన్నాడు సూపర్నెంటు.

"మా వూరొచ్చి మీరిలా తిరిగెల్లటానికిల్లేదు. మాడిన్నరు తీసుకువురీ వెళ్ళాలి" అని సూపర్నెంటును బలవంతం చేశాడు ప్రెసిడెంటు. ఒప్పుకోక తప్పలేదు సూపర్నెంటుకి.

ప్రెసిడెంటు కాకినాడలో 'బార్' ఒకటి ప్రారంభించే వుద్దేశంతో వున్నాడు. అలాంటి పెద్దమనిషికి సూపర్నెంటు దగ్గిర కాస్త పలుకుబడివుంటే ఎంతైనా మంచిది కదా?

అరడజను కోళ్లను కోయించి, సూపర్నెంటుకీ, ఇతర పోలీసు బలగానికీ ఘనంగా విందుచేశాడు ప్రెసిడెంటు. అందులో క్రిష్ణంరాజుకూడా పాల్గొనవలసి వచ్చింది.

విందు పూర్తయిన తర్వాత సూపర్నెంటు కార్లోవెళ్ళిపోయాడు, "రేపు సాయంత్రానికల్లా రిజల్ట్స్ రావాలం"టూ.

" తెల్లారితే ఏవూరిమీద పడదామా " అని ఆలోచిస్తూ • పోలీసు సిబ్బంది జీపెక్కింది.

*　　*　　*

మూడోనాటికి గంగడు కొంచెం కోలుకున్నాడు. ఆమూడు రోజులూ మాలపల్లి వాళ్లంతా అతన్ని పరామర్శించారు; అన్ని సపర్యలూ చేశారు. అబాలగోపాలం అతని పట్టుదలను మెచ్చుకున్నారు. పోలీసు మూకను తిట్టిపోశారు. పోలీసువాళ్ళ చేతిలో విషాకారణంగా దెబ్బలుతిన్న మాదిగపల్లి వాసులిద్దరి విషయంలోనూ వారుజాలిపడ్డారు.

మొత్తంమీద వారి సాహసానికీ, చొరవకూ ఫలితం దొరికింది. వాళ్ళ శ్రిమ వృధాపోలేదు. రహస్యపద్ధతిలో, ఐకమత్యంతో చేసిన ఏపనైనా విజయవంతంగా జరుగుతుందని ఆ నిరుపేదలు అనుభవంలో తెలుసుకున్నారు. చిత్రిమేమిటంటే ఈ ఘటనతో ఏళ్లతరబడి శత్రువులుగా వుంటున్న కుటుంబాలు కూడా ఏకమయ్యాయి. ఈ ఘటన వారందరికీ గొప్ప వుత్సాహాన్ని కలిగించింది

ఇంత జరిగినా వాళ్ళ రహస్యం మాలపల్లి దాటిపోలేదు. వాళ్ళు మామూలుగానే పనులు చేసుకుంటున్నారు "బియ్యం అరువియ్యమ"ని కోమటి శేషయ్యని బతిమాలు తూనే వున్నారు; తవ్వెడో–శేరో తీసుకెళ్తూనే వున్నారు.

*　　*　　*

ఆరోజు తెల్లవారుతోందగానే నారాయుడు వుతికిన చొక్కావేసుకుని సుందర్రావు కెదురయ్యాడు కాలవగట్టుమీద.

"ఏవూరెల్తన్నా?" అని అడిగేడు సుందర్రావు.

"ఊబలంక. సందాల కొచ్చేత్తాను. అక్కడ మా బావ్మరిది కుటుంబం తిండికి లేక నానాబాదలూ పడతన్నారు. ఐదురూపాయి లంపమని రావులపాడు సిన్నియ్యసేత కవురంపించేడు. సరే, పట్టికెల్లిచ్చినట్టూ వుంటది; ఆళ్ళన్నూసొచ్చినట్టూ వుంటదని మా యాడది జెపితే యెల్తన్నాను" అని. "అన్నట్టు మనం నడిపినయెవ్వారం ఆడిక్కూడా సెబుతాను. ఊలుకుదిరితే అళ్ళుకూడా మనం జేసినట్టే సేత్తారు. మరెంతకాలం వని కడుపులు కాలబెట్టుకుంటారాళ్ళుమాత్తరం?" అన్నాడు నారాయుడు.

"సెప్పు. నమ్మకం వైనోళ్ళందరికీ సెప్పాలిమరి. ఒరేయ్, మనంవంతా కలిసి కట్టుగావుంటే ఈ పెపంచకం మొత్తంమీద మన్నెవడూ ఏంవీజెయ్యాలేడు" అన్నాడు సుందర్రావు, నారాయుడు వెళ్ళిపోయాడు.

చేసింది చాలదనీ, ఇంకా ఏమేమో చెయ్యాలనీ సుందర్రావుకి అనిపిస్తోంది. అతని బుర్రలో ఎన్నో ఆలోచనలు.... ఎన్నోవ్యూహాలు :

"పాలేరోడూ, కూలోడూ కడుపునిండా తిని, తలెత్తుకు తిరిగే రోజెప్పు డొత్తదో !"

"అయ్యా బాబూ అవి బలిమాలితే నాయం జరిగేరోజులు కాదియ్య"........

తూర్పుదిక్కున అరుణభాను డుదయించాడు.

## జనం

శ్రీపతి

వలభై మైళ్ళ ప్రయాణమే అయినా రెండు గంటలు పట్టింది. దారంతా ఇళ్ళ కొస్తున్న పసుల మందలు. ఆ పసులకాపర్లు వాటిని రోడ్డుకు ఓపక్కనించి తోల్తారా అంటే రోడ్లకి ఒకపక్కే ఉంది రెండోపక్క అన్నదిలేదు. ఇంకొన్ని దగ్గర్లయితే ఎదురుగావస్తున్న రథాన్ని పూర్తిగారానిచ్చి రెండోరథం కదలాలి. ఇక అది ఏకారయి తేనేం– రెండు గంటల్లో వచ్చినందుకు సంతోషం.

డ్రయివర్ ఆపేసి 'ఇక్కడ దిగిపోవాలి సార్' అన్నాడు.

చౌదురి దిగాడు. చుట్టూ కొబ్బరితోటలు. రకరకాల చిన్నా పెద్దా చెట్లు. అన్నీ ఒకేరంగుతో నల్లగా, అడవిలోకి వచ్చినట్టుంది.

దగ్గర్లో చింతచెట్టు కింద కూచున్న జనం ఐదారుగురొచ్చి 'నమస్కారం బాబయ్యా', 'నమస్కారాలు బాబయ్యా' అని కారులైటు వెలుతురులో కనిపిస్తున్న చౌదురిచుట్టూ చేరారు. వాళ్ళల్లో సుబ్బయ్యలేడు. అందరూ కొత్తవాళ్ల ఒక పేంటు కుర్రాడున్నాడు. మిగిలిన వాళ్ళంతా తలపాగాలు, నడుం చుట్టూ పంచెకట్టుకున్నవాళ్ళే. అలాంటి మనుషుల్ని గుంపుగా చూస్తే చౌదురికి అనుమానం. రెండేళ్ళకిందటయితే అక్కడికి అలాంటి సమయంలో చౌదురి రాలేడు. కల్లోలిత ప్రాంతాలుగా పేరు మోసాయి. ఇప్పటికీనీ, భూస్వాములు ఇళ్లువిడిచి పేదల ఇళ్ళలో తలదాచుకునేవాళ్లు. లేదా టౌన్‌లకిపోయి హోటల్స్‌లో ఉండేవాళ్లు. ప్రభుత్వం తీసుకున్న కట్టుదిట్టాల వలన పరిస్థితి ప్రస్తుతానికయితే అదుపులోకివచ్చింది. అయినా చౌదురిగుండె పీకుతూనే ఉంది. పెళ్ళిపేరుతో కుట్రకాదుకదా అన్న అనుమానం అక్కడదిగిన తర్వాత ముంచు

కొచ్చింది. డ్రియివర్ కారులైట్ తీసేస్తే ఆన్‌చేయమని చెప్పి అందరికీ ప్రీతి నమస్కారాలు చేసాడు.

'కారు ఇంక ముందుకెల్లదు బావు- ఇక్కడే ఆ సింతసెట్టు కింద దాన్నొదిలేసి- తఁవరు ఊర్లోకి-' అని ఒక ముసలిగొంతు చెప్పింది. 'నాలుగడుగులు నడిస్తే ఊరు బావు. ఈ తోటలమూలాన ఊరు కనబడదుకాని-' అని ఇంకో పెద్దవయసు గొంతు చెప్పింది.

'సొరాజ్జెం వొచ్చిన్రోజుల్లో ఇక్కడ ఈగడ్డమీద వొంతెన కటతారన్నారు బావు. ఏదీ సొరాజ్జెం. ఈ ఊరికొక బస్సులేదు. ఒకరోడ్డు ఇదేనా అప్పుడేకాలానో కరువొస్తే ఏసిన్రోడ్డు- దానిమీద మల్లా మన్నన్నా కప్పిన పాపానపోలేదు. సూసుంతారు గదా అడ్డురోడ్డు తిరిగిన కాడ్నించి- ఈ ఊరుదాటితే అటు పదూళ్లు ఇంకా అదవాన్నం. ఈ రోడ్డుకూడా లేదు' అని సొరాజ్జాన్నెరిగిన ఒక నడివయసు మనిషి జీరగొంతులో చెప్తున్నాడు.

చౌదరిగారి కారువెలుగుతో రోడ్డు, ఆముందు పెద్దవంతర, దానిచుట్టూ తోటలు కన్పిస్తున్నాయి. ఆ వెలుతుర్లో జనం కొంచెం కొంచెం స్పష్టంగా కన్పిస్తున్నారు మూడు తలపాగాలు. అయిదు బనీనుల్లేని నల్లటి ఎండిన శరీరాలు. చెప్పుల్లేని జంతువుల పాదాల్లాంటి పెద్దపెద్దపాదాలు. మకిరికొమ్మలకు అతుక్కొన్న ఊడల్లాగ ఉబ్బిన నరాలతో మోకాళ్ళు

'లగ్నం ఏళ అవొస్తున్నాది బావు. నడుతుమా ?' అని మళ్లీ ముసలిగొంతు.

'సుబ్బయ్య నీకొడుకా ?' అడిగాడు చౌదరి ఆ పోలికలు చూసి.

'కాదు బావు, మా తమ్ముని కొడుకు'.

'పెళ్ళికొడుక్కి పెద్దయ్య అవుతాడు బావు' జీరగొంతు

'డైవేరు బావూ, వస్తన్నావా ? ఇక్కడ కారుకాపలా మనోళుంతారు' అన్నాడు ఇంకో తలపాగా.

కారుని చెట్టుకిందికి నడిపి లాక్‌చేసి దిగాడు. కన్నుపొడిచినా కనుపించనంత చీకటి.

ఆ ఎదురొచ్చిన జనంలో ఒక టార్చిలైట్ వెలిగింది. డ్రైవర్ కూడా టార్చిలైట్ వెలిగించాడు.

జనం చౌదరి అంగరక్షకుల్లాగా చుట్టి నడుస్తున్నారు.

డ్రియివర్ యూనిఫామ్‌లో ఉన్నాడు. చౌదరే వయసులో చిన్నవాడయితే డ్రియివర్ మరీ చిన్నవాడిలా ఉన్నాడు. ఇరవైరెండు ఇరవైమూడేళ్లు దాటవు. ఇద్దరు

తలపాగా మనుషులు కారుదగ్గర ఉండిపోయారు. వస్తున్నవాళ్ళల్లో ఒకాయన చింతచెట్టు కింద మంటవి పుల్లతో అటూ ఇటూకదిపి బీడి వెలిగించుకుని ఒక అంగలో ముందు నడుస్తున్నవాళ్లతో కలిసిపోయాడు.

* * *

కొండ పంచనకట్టిన వూళ్ళో వీధిలా ఉంది. ముందుకు పోతున్నకొద్దీ మెట్లెక్కుతున్నట్టుంది. దానికితోడు ఇరుగ్గా. ఐదారుగురు నడిస్తే ఒకరివెనక ఒకరు నడవాలి. లేదా రెండోమనిషి రాళ్లమీద, కట్టెలమీద అడుగులేస్తూ, చిత్తడినేలను దాటుకుంటూ పోవాలి. వాళ్లందరికీ అలవాటే చౌదురి గుడ్డివాడు నడుస్తున్నట్టుగా తడుముకుంటున్నాడు.

దూరంగా పెళ్ళి హడావిడి గొడవ. పెట్రొమాక్స్ లైట్లవెలుగు. జనం ఊరికే పరుగులెట్టున్న సందడి. ఓపక్క కుక్కల గొడవ. పల్లెటూళ్ల పసుల మందల వాసన.

కొత్తదేశాన్ని చూసినట్టుగా ఉంది చౌదురి పల్లెటూళ్లు చూసాడు. కాని ఇల్లాంటి ఊరు చూడలేదు. వీధిలో ప్రతి ఇంటిముందూ ఒకటో రెండో మేకలో, ఆవుదూడలో గొర్రెలో పండుకునో నుంచునో - ఉన్నాయి.

పొప్రయిటర్ వస్తున్నారని నడి తెలీటంతోనే సుబ్బయ్య ఎదురొచ్చి నమస్కారం చేసి విధేయంగా నుంచున్నాడు. పెళ్ళికొడుకు అన్నది మరిచిపోయి తను ఎప్పుడూ కళాసీనే అన్నట్టుగా ఉంది వాడితీరు. పొప్రయిటర్ బాబు తనపెళ్ళికి వస్తున్నాడన్న సంగతి వూళ్ళో అందరికీ కాకపోయినా తనకులంలో అందరికీ తెలిసిపోయింది. గొప్పగా, గర్వంగా చెప్పుకున్నాడు. ఏ తొందర పనియూలంగానన్నా పొప్రయిటర్ బాబు రాలేకపోతాడో ఏమోనని ఇప్పటిదాకా భయపడుతున్నాడు. ఇప్పుడు ఆ భయమంతా పోయింది.

'బాబొచ్చినాడు.... పొప్రయిటెర్ బాబొచ్చినాడు.... పట్నం బాబొచ్చినాడు....' అని చెప్పుకోవడం, మనుషుల్ని తప్పించుకుని చౌదురిని చూడడం .. మళ్ళీ 'మన సుబ్బయ్య పొప్రయిటర్ బావురా. టౌన్‌ల మిల్లు, లారీలూ, పెద్ద హోటేలూ– ఆ బాబు– ఆ బాబు యీ మట్టిమీన అడుగుపెట్టినాడంటే అదే వెయ్యివరాలు రాజులాంటి మనిషి. తండ్రి సనిపోయినతరాత .... సిన్నోడయినా తండ్రికంటె గనుడవిపించుకున్నాడు....' అని మిల్లుసంగతి పట్నం సంగతి బాగా ఎరిగిన పెళ్ళికొచ్చిన పొరుగూరు పెద్దమనిషి చెప్తున్నాడు. వచ్చి మూగుతున్న జనమంతా నమస్కారాలు కురిపిస్తున్నారు.

జనం దృష్టి పెళ్ళికొడుకు మీదినుంచి జారిపోయి చౌదరిమీద పడింది.

వీధిలో పెళ్ళి పందిరికి దగ్గరగా నుంచున్నాడు చౌదురి. సుబ్బయ్య, ఐదారుగురు పేంటు లేసుకున్న మిత్రులూ, ఇంకా పెళ్ళిపెద్దలు చుట్టుముట్టారు.

కుంటుకుంటూ వచ్చాడు సుబ్బయ్య తండ్రి. పక్షవాతం. అదీ ప్రమాదకరంగానే ఉంది. కొత్త నేతపంచె ఒకటి కట్టుకున్నాడు. కొత్త తువ్వాలు ఒకటి భుజాన ఉంది. నుంచోవటానికి చాలా కష్టపడుతున్నాడు. ఎడంకన్ను చిన్నదయిపోయింది. ఎడంపక్క మూతి ముడుచుకు పోయింది.

ప్రొప్రయిటర్ అనుకుని కారు డ్రయివర్ని రెండోచేతిని ఎత్తలేక నమస్కారం చేసాడు. పక్కనున్నవాళ్లు ఎవరో చూపితే మళ్ళీ చౌదురుని నమస్కారం చేసాడు. ఎడం కాలు ఎడం చేయి చచ్చిపోయాయి. మందులు కొనాలి బాబూ అని సుబ్బయ్య మధ్యమధ్య డబ్బు మేనేజర్ని అడుగుతుండేవాడు. అట్లాంటి దృశ్యాలు చూస్తున్నప్పుడు బతకటానికి వంద అబద్దాలు అనుకునేవాడు చౌదురి.

పెళ్ళికొడుకు వేషంలో కళాసీ సుబ్బయ్య పసుపుబట్టలూ, మెడలో ఎరువుతెచ్చిన బంగారంచైను చిన్నదీ, కళ్ళకి కాటుక, నుదుట నామమూ, తలపాగా – యివన్నీ ఉన్నా ఆడమ్మలుకూడా కొంటెచూపుల్తో, ఓరఓరగా, సిగ్గుతో, భయంతో చౌదురినే చూస్తున్నారు. పాతవాళ్ళు పనులమీదికిపోతున్నా కొత్తవాళ్ళు ఇంకా ప్రొప్రయిటర్ బావును చూడటానికి ఎగబడుతూనే ఉన్నారు.

ఒకపక్క భోజనాలవుతున్నాయి. కొంచెందూరంగా. వీధిలోనే. అక్కడ వడ్డనల గొడవ. ఆకలి. కడుపుమంటగొడవ.

ఆ పెళ్ళికివచ్చిన వాళ్ళంతా ఆ షూరి కులంవాళ్ళు తప్పించి వేరేవాళ్ళు ఎవరూ ఉన్నట్టులేదు. మారుకులంవాళ్ళు నలుగురయిదుగురు నేస్తాలువచ్చినట్టున్నారు అంతే.

పేంట్ కుర్రాళ్ళు ఇద్దరు చౌదురిని ఎదురుగాఉన్న సిమ్మెంట్ అరుగుమీదికి తీసుకుపోయారు. తాటికమ్మల ఇల్లేఅయినా నీటుగాఉంది. అక్కడ ఒక వాలుకుర్చీ ఉంది. కింద జంపఖానా పరచిఉంది. ఆ ఇంటి ఎదురుగానే పెళ్ళిపందిరి. కొబ్బరి కమ్మలతో, మామిడి ఆకుల తోరణాలతో, కొత్తవెదురు బొంగులతో పెళ్ళిపందిరి. అరికి ముగ్గులతో అలంకరించిన పెళ్ళిపందిరి.

ఇట్లాంటి పొదుపుఅంటే చౌదురికి చాలాఇష్టం. పెళ్ళిళ్ళకోసం హడావిడిచేసి వేలకివేలు తగలబెట్టేతీరు అతడికి నచ్చదు.

నర్సయ్య బిలాయ్‌నించి స్నేహితుని పెళ్ళికోసంవచ్చాడు. ఇరవైయ్యేళ్ళ పేంట్ కుర్రాడు. అతడు చౌదురికోసం అన్నిఏర్పాట్లుచూసే ఇన్‌చార్జి. వాలుకుర్చీలో చౌదురి

కూచున్నాడు. గుంపుగాచేరినజనం వెళ్ళిపోయినతర్వాత నలుగురయిదుగురు స్నేహితులుమాత్రం చౌదురిచుట్టూ మిగిలారు.

'బాబూ' ఈ పూళ్ళ ముప్పయి నలభై ఎకరాలకుమించిన రైతు ఒక్కడు లేడండి. కాని బాబూ యీ పెద్దమనుషులకున్న గర్వంమాత్రం యింతా అంతా కాదంటె నమ్మండి. మాలాంటి పేదోళ్ళం ఏ పట్నంలోనో ఏదో చిన్న ఉద్యోగంలోచేరి వస్తే మరీ పేంటు వదల్లేంగదా. ఆళముందు పేంటేసుకుని నిలబడకూడదు. చెప్పులు తొడుక్కుని ఆళముందు నడకూడదు. తెల్లనిబట్ట వొంటిమీద ఉండకూడదు చూసినారో- అప్పుడు నాలుగేళ్ళకిందట పారిపోయినాను, యీ కంబారితుకు తప్పిపోయింది బతికి పోయినాను. మీరు తలంచితే యీవూరుకొనేయగలరు. కళాసీ పెళ్ళిని తమరు- అంతదూరంనించి- ఎన్నిపనులున్నా ఇటొచ్చినారు. మరి పూళ్ళోని పెద్దమనిషి ఒక్కడేనా ఇటొచ్చినాడేమో చూడండి. ఆళ ఇల్లకిపోయి అకూసెక్కా ఇచ్చి. బత్తెమిచ్చి. కులసంగానికిచెప్పి, మల్లా ఇంటింటికిచెప్పినా- ఎవ్వరూరాలేదు మరి పూళ్ళోని ఆళకి సావొచ్చినా, పెళ్ళొచ్చినా, పండుగొచ్చినా, అవసరమొచ్చినా మా జనమంతాపోయి నిలబడతాం.'అని బిలాయ్ కార్మిక మిత్రుడు పెద్దమనుషులమీద కోపంతో మాటాడుతున్నాడు.

పెళ్ళికొడుకు కనిపించినట్టే కనిపించి మాయమయ్యాడు.

చౌదురిచుట్టూ అందరూ ఒక యిరువాళ్ళు కూచున్నారు. వాళ్ళలో బిలాయ్ కార్మికుడు మాట్లాడుతున్నాడు. చూడగా మరికొంచెంసేపు చనువిస్తే సోషలిజంగురించి లెక్చర్ ఇచ్చేట్టున్నాడు. కుర్రాడు విగ్గుతీసినట్టు నన్నగా ఏపుగా బలంగా ఉన్నాడు. కళ్ళు పెద్దగా ఎర్రజీరతో పదునుగా ఉన్నాయి.

ఇంకో కెరటం జనం అక్కడ పోగవుతుంటే తోలేసాడు నర్సయ్య

ముహూర్తం వేళయింది పెళ్ళికొడుకోసం బాపనయ్య వెతుకుతున్నాడు. 'ఇప్పుడే వస్తాడుండండి'అని నర్సయ్య చెప్తున్నాడేకాని ఎక్కడికెళ్లిందీ చెప్పడు.

కిక్కిరిసిన జనం అంటే చౌదురికి ఇరుగ్గా ఉంటుంది. ఆ జనం ఎక్కడ ఎప్పుడు చెలరేగిపోతారోని భయం. నలుగురయిదుగురుకంటె ఎక్కువజనం ఉంటే అతడికి పడదు. ఇలాంటి పెళ్ళిళ్లన్నా, సినిమాహాల్సులో జనమన్నా, స్టేడియమ్‌లో జనమన్నా చౌదురికి వినోదంగా ఉంటుంది, ఇప్పుడు చౌదురి దృష్టి అక్కడ అటూ ఇటూ తిరుగుతున్న ఆడపిల్లలమీద పడింది. పేదవాళ్ళే అయినా కాయకష్టంతో బిగువు దేరిన శరీరాలు. జాకెట్ల నాగరికత అంటుకోని జనాభా. పెద్దపెద్దకళ్ళు. పేదరికాన్ని యవ్వనంతో కప్పుకున్నవాళ్ళు. కాయకష్టమే ఒక అందమన్నట్టుగా అక్కడ మనుషులు.

పెళ్ళికొడుకు ప్రత్యక్షమయ్యాడు.

స్వీట్స్, జీడిపప్పు స్టీల్ ప్లేట్స్‌తో తెచ్చి చౌదరిముందు నుంచున్నాడు. వెనకే ఇంకో కుర్రాడు స్టూల్ మోసుకొచ్చాడు.

'ఏదీ కామేశు, ఎక్కడ?' అడిగాడు చౌదరి డ్రైవర్ గుర్తొచ్చి.

'అన్నం తింటున్నాడు బాబు'

'ఎక్కడ, ఎప్పుడు జారుకున్నాడు?' చౌదరికి తనసేవచేసేవారంటే అభిమానం. తనమాట వినేవారంటే అభిమానం. అందుకోసం కామేశుని వెతికాడు.

స్టూల్ మీద సుబ్బయ్య అన్నీ సర్దుతున్నాడు.

సన్నాయి మోత పెళ్ళిమేళం ఆరంభమయింది. పెళ్ళికొడుకోసం ఎవరో వచ్చారు ఆడాళ్లు.

'అటు వెళ్ళరా. ఈ సంగతి తర్వాత .' అని కోప్పడ్డాడు చౌదరి.

'ఆఁ ఆఁ వెళ్లిపోతున్నాను బాబూ', అని నర్సయ్యను పిలిచి డ్యూటీ అప్పజెప్పి వెళ్ళిపోయాడు.

తనకిపెట్టిన స్వీట్స్ జీడిపప్పు కనీసం పదిరూపాయిలన్నా ఖరీదుచేసేట్టున్నాయి. చూడగా అవి ఇక్కడ దొరికేట్టు కన్పించలేదు. అవన్నీ తినేంత ఆకలి చౌదరికి లేదు. కాని సుబ్బయ్య అభిమానం, భక్తి.

కళాసీగానే సుబ్బయ్య ను ఇన్నాళ్లూ చూసాడు. వాడు మిల్లులో బస్తాలు మోస్తాడు లారీలు లోడ్‌చేస్తాడు. అన్‌లోడ్ చేసాడు. ఒక్కోసారి లారీతో వెళ్తాడు. టీనీళ్ళు తాగుతూనో, బీడీ వెలిగించుతూనో అప్పుడప్పుడు కనిపించేవాడు. అంతకంటె వాడికథేం తెలీదు.

సందుచేసుకుని సుబ్బయ్య తల్లి వచ్చింది. జుత్తంతా నెరిసిపోయి నడుం పడిపోయిన ముసలితనం. పీక్కుపోయిన నెత్తుర్లేని ముగ్గిదలాంటి వాళ్లు. 'బాబూమనస్కారం' అని పాదాలు పట్టుకోబోయింది. పాదాలు పట్టుకుంటుంటే చౌదరికి ఇబ్బందిం అయింది. అంతకంటె తనభక్తిని చెప్పుకునేందుకు ఆ ముసలమ్మకు ఇంకోభాషరాదు. నర్సయ్య 'బాపనయ్య పిలుస్తున్నాడు, పద అని తీసుకుపోయాడు అక్కడినించి. అలా పాదాలకి మొక్కడం నర్సయ్యకి నచ్చలేదు. కాని పాతమనుషులు, వాళ్ళబతుకులంతే.

బాపనయ్య తంతు ఆరంభమయింది. ఒక కోణంలో మనుషుల సందులోంచి పెళ్ళిపీటలమీద సుబ్బయ్య కనిపిస్తున్నాడు. సన్నాయిమేళం పక్కింటి గడపలో కూచున్నారేమో చెవుల్ల గింగుర్లెత్తిపోతున్నాయి జీడిపప్పు ఒక్కొక్కపలుకే నోట్లో వేసుకుంటున్నాడు.

'పాలు బాబూ' అని వర్సయ్య స్టీల్ గ్లాస్‌ని స్టూల్ మీద ఉంచాడు.

* * *

'సుబ్బయ్య ఇప్పుడు మనిషయినాడుగాని బాబూ— మీ కొల్ఛవులో సేరిందాకా ఆడు మనిషికాడు. అప్పుడు యీ పెళ్ళికూతురు పిల్ల ఉన్నాదే— దానిపేరు జోగమ్మ— అది యీడిని పెళ్ళాడుతానంటే— దాని అమ్మా అయ్యా కానిచ్చినారుకాదు. ఆసు పెద్ద నాయిడుకాడ కంబారి. ఆ పెద్దనాయిడున్నాడంటే ఆడు మనుషుల్నెత్తురుతాగే మనిషికాని మామూలు మనిషికాడు అడి చెయ్యిపడి ఎన్ని ఇళ్లు నాశన మయిపోయినాయో, ఎందరు కన్నెపిల్లలు కడుపులొస్తే నూతిలోపడి చచ్చిపోయినారో అదంతా ఒక రామాయణం. సుబ్బయ్య నాతోటే బిలాయ్ వచ్చేవాడు కాని పెద నాయిడుకి బయిపడి రాలేకపోయినాడు. తల్లీ దండ్రీ ఆడిమీద ఐదొందలు అప్పుతెచ్చి నారు పెదనాయిడుకాడ. ఆ అయిదొందలూ తీర్చేయాలంటే ఆడు ఐదేళ్లు కంబారితనం చేయాల. కంబారోడికి పిల్లనియ్యనని కూకున్నాడు యిప్పుడీ జోగమ్మ కన్నతండ్రి. ఆపిల్ల ఇష్టంలేని మనువు. గొర్రెలు కాసుకుంటాడు ఎంకన్న. ఆడికిచ్చి పెళ్లిచేసినాడు— పెళ్ళని పేరేగాని వారం దినాలుకూడా అత్తోరింటికాడ మనవలేదు జోగమ్మ. తర్వాత మనువుకే ఎల్లలేదు. కాని అప్పటికే దానికడుపున ఒక కాయఎడిపోయింది'.

పెళ్లి ఊరేగింపుకి వెళ్లింది. మనుషులు కూడా అంతా ఊరేగింపుతో వెళ్ళిపో యారు. వీధికి తూర్పున ఐదారుగురు వంట మనుషులు వడ్డన మనుషులు అన్నీ సర్దు తున్నారు ఉన్న ఒకే పెట్రొమాక్స్‌లైట్‌ని ఊరేగింపుకు తీసుకుపోయారు. చౌదురి కూచున్న అరుగుమీద ఓ మూలకు అరికెన్ లాంతరు పేదవాళ్ల బతుకులాగ మిణుకు మిణుకు వెలుగుతున్నది.

చౌదురి స్వీట్స్‌లని పాలుతాగిన తర్వాత యీజీచైర్ లో మాగన్నుగా నిద్రపట్టింది. అసలు చౌదురి అంతసేపు అక్కడ ఉండాలని రాలేదు వచ్చి ఓసారి పెళ్లికొడుకును చూసేసి పోవాలని వచ్చాడు. పెళ్ళి పూర్తయేవేళకి నిద్రపోతున్నాడు. నిద్రలేపడం ఇష్టంలేక కొంతసేపు డ్రైవర్ కామేశు అక్కడేచూసి తర్వాత పెళ్ళివాళతో వెళ్ళి పోయాడు.

బిలాయ్ కార్మిక యువకుడు నర్సయ్య. పోస్ట్ బంట్రోతు సిమ్మన్న. సింగిల్ స్కూల్ టీచర్ సీతారాముడు, వర్సయ్య తమ్ముడు వీరరాఘవులు చౌదురి చుట్టుకూచుని కబుర్లు చెపుతున్నారు. కుర్చీలో కూచోవడం ఇబ్బందిగా ఉండి చౌదురి కిందగోడకాను కుని కూచున్నాడు. రెండోమనువు అమ్మాయిని సుబ్బయ్య చేసుకోవడం ఎక్కడో హాలివుడ్ సినిమాల్లో, ఇంగ్లీషు నవలల్లో జరిగినట్టుగా ఉంది, పైగా ఒక పిల్లవానితో.

పరాయి మగవానితో మాటాడినందుకు, ఎక్కడినించో ఒక ఉత్తరం ముక్క వచ్చినందుకు, ఎవరో ఇచ్చిన బహుమతికి సంబంధం చెప్పనందుకు, మాటాడినా మౌనంగా ఉన్నా విపరీతమైన అర్థాలు సాగదీసి సంసారాలు కూలిపోయే ఈ దేశంలో ఒక మగవానితో కాపరంచేసి, పిల్లవాణ్ని కన్న స్త్రీని— దాన్ని దేన్నీ పట్టించుకోకుండా సుబ్బయ్య పెళ్ళి చేసుకోవడం విచిత్రంగా ఉంది. అడిగితే 'మా కులంల మారు మనువులున్నాయి బాపు. ఆడది ఏడు మనువులు మనవొచ్చు' అని చెప్పాడు వీరరాఘవులు.

మళ్ళీ చౌదురికి ఆశ్చర్యం కలిగింది.

'బాబూ, మా కులంలో ఇష్టం లేకపోతే ఇడాకులిచ్చేసి మరొక మనువుచేసికుంటారు. అదే యీ పెద్దకులమోళ్ళ సంగతి చూడండి. ఎన్ని రంకుతనాలో, ఒకసామెతున్నాది బాబు పెద్దసెరువు కంపు పెద్దింటి రంకు బయటపడదని. అలాగ....' అని మళ్ళీ నర్సయ్య భూస్వాముల మీదికి తిరిగి రేచుకుక్కలా పడ్డాడు.

నర్సయ్య తిట్లలో కొన్ని అందరు ధనవంతులకీ వర్తిస్తాయి. అవి చౌదురికి తగుల్తున్నాయి. 'ఈ కష్టపడేవాళ్ళ చెమట నెత్తురూతాగి ఎంతకాలం ఈ లంజకొడుకులు సుకపడతారో జనం చూస్తారు బాబూ. ఈ లంజకొడుకుల్ని చూడండి ఒక్కడూ మంచి చావు చవ్వడు. ఒక్కొక్కడికి ఒక్కొక్క పెద్దరోగం వస్తాది. మీకు తెలుసునో తెల్దో గాని బాబూ, ఈ పెద్దనాయుడు తండ్రి కాళ్ళూ సేతులూ రాలిపోయి, ఒళ్లు చర్మమంతా పుళ్ళయి ఇప్పటికీ బతికేఉన్నాడు. నరకమంటే ఎక్కడో ఉండదు బాబూ— మా కాయాకష్టం మనుషుల సంగతి చూడండి. జబ్బో జరమో వొస్తాది. నాలుగురోజులు కంటే మంచం మీదుండదు. సుకంగా చచ్చిపోతారు' అని చెప్తున్న మాటలు వింటున్నాడు. ఎదురు మాటాడడం ఇష్టంలేదు. వినివిని విసుగెత్తిపోయాడు. ఇట్లాంటి సంగతులు వినడం చౌదురికి అస్సలు ఇబ్బందిగా ఉంటుంది.

తన గురించి ఈ బిలాయ్ కార్మిక యువకుడికి బొత్తిగా తెలీదు. అనుకోవటానికి వీల్లేదు. ధనవంతులను తిట్టేతిట్లు తనకు తగుల్తాయని తెలిసిమరీ తిట్టున్నాడు. లేక ఈ పెళ్ళికి వచ్చినందుకు తనని మరీ గొప్పవానిగానన్నా భావిస్తూ ఉండాలి. లేక ఇక్కడ వాళ్లతోపాటు ఈ గచ్చు అరుగుమీద చలిలో కూచున్నందుకు వాళ్ళతోటిమనిషిగానన్నా తీసుకొని ఉండొచ్చు. ఒక్కటి మాత్రం ఖాయం నర్సయ్యకి చాలా కోపం, పగ, ద్వేషం, కసి ఉన్నాయి, ఆవూరు పెద్దమనుషుల మీద.

* *

టార్చిలైట్ వెలుగు తమవేపు రావటం కనిపించింది.

'నమస్కారాలు బావూ, నమస్కారాలు'

చూరు చాటున ఆ వచ్చిన మనిషి తలకాయ కన్పించలేదు. ఎమ్మెల్యేలాగా ఖద్దరు పంచె ఖద్దరు చొక్కాతో కన్పిస్తున్నాడు. ఇంకొంచెం పక్కకొచ్చాడు గడప ముందుకు. ఇప్పుడు ముఖమయితే కన్పించిందిగాని రాట నీడ ముఖంమీద పడింది. లాంతర్‌ని పోస్టు బంట్రోతు సిమ్మన్న కొంచెం పక్కకి పెట్టాడు. లాంతరు వెలుగు ముఖంమీద పడినా ఆ కొత్తమనిషి పరిచయమున్న గుర్తు చౌదురికి లేదు.

'పెద్దనాయుడు బావు' అని నిలబడ్డారు కుర్రాళ్ళంతా.

'ఆరె సర్పిగా, పెద్దమనుషులొస్తే ఇంటికొచ్చి సెప్పొద్దురా. ఎంత నీవు ఉద్యోగం సేస్తున్నా- వూరు పరువూ మర్యాద యింత బేగి మర్సిపోతె మంచిదికాదురా. నివు బిలాయిలోనో యిశాపట్నంలోనో పేంటూబూటూ యేసుకోవచ్చు కాని లంజకొడకా నీతల్లీ తండ్రీ, నీ సెల్లీ తమ్ముడూ ఇక్కడ బతకాల. ఆ మద్దిన నీ తండ్రిని ఎవడో పొరుగూరోడు మక్కెలిరగదన్నాడు. ఎవడడ్డమొచ్చాడ్రా. నివు బిలాయినుంచి పారొచ్చినావా. ఊరు సంగతి మరిచిపోకండ్రా. ఏంమేష్టరు ఇక్కడ కూకుండి పోయినావు బావుగారొచ్చినారనొచ్చినావు. ఈ లంజకొడుకులకి కళ్లు నెత్తిమీది కెక్కిపోయినాయి బావు.' అంతలో తను వచ్చిన పని గుర్తుకొచ్చింది. 'బావూ తవరు ఇక్కడ కూకుండి పోయినారు. లెగండి మనింటికి ...' అని గొంతు స్వరం. మాటతీరు అమాంతం మార్చేసి మాటాడాడు. ఇంతక ముందు నర్సయ్యను తిట్టిన నోరేనా చౌదురిని బతిమాలుతున్నది అనిపించింది. అక్కడకి కొత్తగా వచ్చిన సింగల్ టీచర్ సీతారాముడుకి.

ఆ పెద్దమనిషి వచ్చీరావడంతోనే అందుకున్న ధోరణి చౌదురిని కొంత ఆశ్చర్యపరచింది, అతడికి భూస్వాముల స్నేహం ఉంది. చాలామందిని బాగాఎరుగును. ఈ పద్ధతిలో మాటాడ్డం చౌదరి వినలేదు నక్సలైట్‌లు ఈ జిల్లాలో వచ్చినతర్వాత కూడా ఈ ధోరణిలో భూస్వాములున్నారంటే నక్సలైట్లు రాకపూర్వం ఇంకా ఎట్లా ఉండేదో ఊహకు అందటంలేదు.

వందమందికి మించిన ఉద్యోగులు కళాసీలు చౌదురికింద పన్చేస్తున్నారు. వాళ్ళకి కార్మిక సంఘంలాంటిది ఏంలేకపోయినా మంచిగా మాటాడుకుని పనిచేయించుకోవటంలో ఉన్న లాభం. ఈ ధోరణిలో ఉండదని తక్కువకాలంలోనే చౌదురి గుర్తించాడు. తనకింద పనిచేసే మనుషులంతా ఒట్టి అల్పసంతోషులు. ఒక మంచి మాటకీ, ఒక చిరునవ్వుకి ఇలాంటి సమయంలో ఇచ్చిన పదిరూపాయిల కట్నంకీ, చావొస్తే పోయి పలకరించినందుకీ సంతృప్తిపడిపోయే అల్పసంతోషులు. అది బాగా తెలుసుకున్నాడు కాబట్టే తన బలగంచేత రెట్టింపుపని చేయించుకో గలుగుతున్నాడు. వాళ్ళ పేరిమకి, అభిమానానికి పొసర్రియిటర్ బాబు మంచోడు అన్న గౌరవానికీ నోచుకున్నాడు.

చౌదురి రెండేళ్ళకిందట తండ్రి చనిపోయేవరకు యూనివర్సిటీ విద్యలోఉన్నాడు. తర్వాత తల్లీ మేనేజరూ వ్యాపారాన్ని నడుపుకొచ్చారు. ఇటీవల ఒక సంవత్సరంగా మాత్రమే చౌదురి హయాం ఆరంభమయింది. కిందటి పార్లమెంట్ ఎలక్షన్‌లో చౌదురికి రాజకీయాల్తో ప్రత్యక్షసంబంధం ఏర్పడింది. కొత్త కాంగ్రెస్ పేర్లలో చౌదురి పేరు కలిసింది. పెద్ద రాజకీయ నాయకులువచ్చి తమ పరిధిలోకి లాగుతున్నారు. చౌదురికి ఇప్పుడిప్పుడే రాజకీయాలు 'మంచి' వ్యాపారంగా దేశభక్తిగాతోచాయి. అయితే రాజకీయాలకి ప్రజల మనుసుల్ని తెలుసుకోవటం చాలా అవసరం. అలాంటి అవసరంకూడా ఉంది చౌదురి ఈరోజు ఇక్కడికి వచ్చాడు. ఇంతసేపు నర్సయ్య. సింగిల్ టీచర్ సీతారాముడు. వీరరాఘవులు. సిమ్మన్నవాళ్ళతో గడిపినప్పుడు వాళ్ళ మనసు అర్థమయింది. అందుకే నోటిని బాగా కంట్రోల్ చేసుకున్నాడు. లేకపోతే అక్కడ నర్సయ్యతో పేచీవచ్చేది. తిట్టిన తిట్లన్నీ భరించాడు. ఆ ఓపికతోనే చౌదురిని అక్కడి కుర్రాళ్ళు ఇష్టపడ్డారు. భయపడకుండా మాటాడారు.

'మన ఎమ్మెల్యే బావులేడు. ఆయనగారొచ్చారు బావు. ఇప్పుడు మనింట్లో ఉన్నారు. అక్కడ సింతసెట్టుకాడ కారున్నాది అని తెలిస్తే- ఆరాతీసినాను. తమ రొచ్చినారన్నసంగతి తెలిసింది. ఎమ్మెల్యేబావు తమని కలవాలన్నారు 'అని మళ్ళా ఆరంభించాడు.

పెదనాయిడే అక్కడికిరావడం ఆ కుర్రాళ్ళందరికీ కొత్తగాఉంది. పెదనాయిడు సర్పంచ్ అయ్యాడు రెండుసార్లు. గాని ఓట్లుకోసంకూడా ఆయన ఆ వీధికి రావల్సిన అవసరం పడలేదు. ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు మరొకడిని మరొకడినయితే పెద నాయిడు ఏ మామూలు మనిషిచేతో కబురుచేసి రప్పించేవాడు. వచ్చింది చౌదురిఅవటం వలన తనే స్వయంగా తీసుకుపోవటానికి ఈ రాత్రిపూట టార్చిలైట్ వేసుకుంటూ వచ్చాడు.

వెళ్ళటమా మానటమా అన్న సందేహంలో పెదనాయిడు ముఖంలోకి చూసాడు చౌదురి పెదనాయిడు గెద్దలాగ కనబడ్డాడు. పూర్వజన్మలో నమ్మకమున్నవాళ్ళకి గెద్ద జన్మనించి మనిషిజన్మలోకి పెద్దనాయిడు పుణ్యం చేసుకుని వచ్చాడని తటుతుంది. సర్వప్రాణులూ సమానమే అనే జీవకారుణ్యవాదులకి గెద్దలూ మనుషులూ ఒకే పోలికకి పెదనాయిడు సాక్ష్యంగా ఉంటాడు. డార్విన్ సిద్ధాంతంకి కూడా ఒక ఆధారం కనిపిస్తుంది అక్కడ. ఆ కొనదేరిన వంగిన ముక్కు. కళ్ళు. చివరికి ఆ నుదురు, ఆ చూపు- అన్నీ గెద్ద లక్షణాలే.

చౌదురి వెళ్ళిపోవాలన్న ఉద్దేశంతో వచ్చాడు. డ్రయివర్ ఊరేగింపుతో పోవటం మూలాన ఆగిపోయాడు. అంతలో ఇప్పుడు వెళ్ళటం బావుంటుందా అన్న సందేహం కూడా కలిగింది. నక్సలైట్లు వచ్చి ప్రజల్ని రేకెత్తించి వదిలారు అన్న ఆలోచనకూడా వచ్చింది. దాంతో ఉదయానికే తిరుగు ప్రయాణం పెట్టుకున్నాడు. కామేశు లారీమీద పర్లాకిమిడిపోవాలి. తెల్లారేపోవాలి. ఈరూటు కామేశుకి తెలుసని తీసుకొచ్చాడు. కొత్తవూళ్ళో, ఇక్కడ ఈ పూరింటి అరుగుమీద ఇబ్బందిగానే ఉంది. చలి ఒకపక్క. పైగా ఎమ్మెల్యే ఉన్నాడు. ఒకసారి పోయి కలుసుకోవడం అవసరం. అంచేత బయల్దేరాడు నాయుడుతో.

* * *

కారుదగ్గర చౌదురిని సాగనంపటానికి పెద్దనాయిడు. ఎమ్మెల్యేరెడ్డి. గురివి నాయిడు. శోభనాచలం గుమిగూడారు. అంతా ఎమ్మెల్యేల్లాగున్నారు.

కొబ్బరి కమ్మల్లోంచి కాంతి చువ్వలు దూసుకొస్తున్నాయి. ఉదయంతో చెట్లు రకరకాల రంగుల్ని పులుముకున్నాయి. నేలమట్టికే అక్కడ అందమొచ్చింది. ఇంకా పొగమంచు చెట్లమీద వాలి ఉంది. చెట్లనించి మంచు చినుకులు కురుస్తున్నాయి.

కామేశు ఇంకా రాలేదు,

'ఆ సుబ్బడింటికాడ డైవేరు ఉన్నాడు కేకెయ్యరో' అని పనిమీద పోతున్న మనిషితో చెప్పాడు పెదనాయిడు. వెంటనే ఆ మనిషి వెనక్కితిరిగి వూళ్ళోకి పరుగెత్తాడు. ఇంకో నిమిషానికి 'ఈడికేం రోగమొచ్చింది ఇంకా కనబడ్డు' అని మళ్ళీ విసుక్కున్నాడు.

పనులన్నీ మాటలమీద జరగాలి. వాళ్లకి అక్కడ నుంచునేంత తీరికలేదు. డ్రైవర్ ఇంకా రాలేదు.

దూరంనించి చెట్లమధ్యనించి జనం,- ఏడెనమండుగురు గుంపుగా పులులు గుహల్లోంచి వస్తున్నట్టు. పట్నం వెళ్ళివచ్చే మనుషులంటే వూళ్లోనాయిళ్లకు గుండెదడ. దానికితోడు నక్సలైట్లొచ్చిన తర్వాత ... ఎంతమందిని కాల్చి చంపిస్తున్నా నేల యీనినట్టు జనం పుట్టుకొస్తునే ఉన్నారు,

వాళ్ళొస్తున్న దిక్కు చూస్తుంటే పెదనాయిడుకి భయమేసింది. 'దండొస్తున్నారు' అన్నాడు ఆ భయంతోనే.

శోభనాచలం గుర్తుపట్టి 'ఆ నడక సూడరా9. సుబ్బడు, నర్సడు, గొట్టోడు, గురవన్న కంబారి, మా మామగారి పనోడు— మనూరి పనోళ్ళేర్రా' అన్నాడు.

గురువినాయుడుకి జంకుపుట్టి అక్కణ్నించి మెల్లిగా తప్పుకున్నాడు. ఆటువేపే వాళ్లతోట ఉంది. తర్వాత ఎమ్మెల్యేరెడ్డి, పెదనాయుడు అక్కణ్నించి 'వస్తాం వస్తాం' అనిచెప్పి జారుకున్నారు. తర్వాత శోభనాచలం 'వస్తాం బాబు' అని కదిలిపోయాడు.

చౌదురి మిగిలిపోయాడు.

డిసెంబరు నెల ఆ చలిలో చౌదురికి వొళ్ళంతా చెమటపోసింది. ఆ వస్తున్న మనుషుల్ని చూసికాదు. ఆ వెళ్ళిపోయిన పెద్దమనుషుల తీరుచూసి.

కామేశు వాళ్ళమధ్య.

సింగిల్ స్కూల్ టీచర్ సీతారాముడు ఒంటెలా పొడుగ్గా ఉన్నాడు. బిలాయ్ నర్సయ్య. పోస్టుబంట్రోతు సిమ్మన్న పులుల్లా ఉన్నారు. వాళ్ళమధ్య కామేశు హీరోలా ఉన్నాడు మిగిలిన కొత్తముఖాలన్నీ నివురుగప్పిన నిప్పుల్లా ఉన్నాయి.

అంతా కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు.

'ఉండిపొమ్మని పట్టేసినారు సార్. వాళ్లందర్నీ బతిమాలుకొని యిడిపించుకు న్నాను. నర్సయ్య కెమెరా తెచ్చినాడు సార్. అందరితో ఫొటో కావాలన్నారు సార్. క్షమించండి సార్ ఆలస్యమయిపోయింది'

దూరంనించి ఐదారుగురు పరుగెత్తుకొస్తున్నారు.

చౌదురికి ఇదేదో కథల్లో, సినిమాల్లో ఉండే కుట్రలా ఉంది.

వాళ్లు ఎందుకలా పరుగెత్తుకొస్తున్నారు. ఇది కల్లోలిత ప్రాంతం. వాళ్లు ఎవరు. వాళ్లచేతుల్లో ఏమిటున్నాయి. వాళ్లని వదిలెందుకొచ్చారు వీళ్లు ముందు. గుండెకొట్టుకుం టున్నది.

'ఇంక ఎద'

డ్రైవర్ సీట్లో కూచున్నాడు. వీల్ మీద ఓచెయ్యి పడింది.

'అన్నా అన్నా ఇదిగో సింగన్న తెల్లోడు అళ్ళొస్తన్నారు. ఉండొక్క చిటం ఉండుండు'

ఇంజన్ స్టార్ట్ అయింది.

పరుగులో వస్తున్నారు.

రాత్రింతా వాళ్ళకి నిద్రలేదు. మంట వేసుకుని చుట్టూకూచుని పాటలు పాడు కున్నారు. కబుర్లు చెప్పుకున్నారు. ఈ పేదరికం పోతుందని కామేశు, నర్సయ్య చెప్తుంటే వాళ్లకి చాలా ఆనందమయింది.

రాత్రి ఊరేగింపులో పెళ్లివాళ్ళతోపోయి పెళ్ళి ఆటలు ఆడినప్పుడు, తర్వాత మంట ముందుకూచుని చలికాగుతూ వాళ్లతో పాటలు పాడినప్పుడు, వాళ్లతో అన్నా తమ్మున్నా మాట్లాడినప్పుడు కామేశు వాళ్లవాడయినాడు. మళ్ళెప్పుడొస్తాడో. పనుల్లోపడి సాగనంప లేకపోయినారు.

వచ్చినవాళ్ళు అలసిపోతూ ఆగి 'ఏమన్నో ఎలిపోతున్నావా' డ్రైవర్ సీటుదగ్గర గుమిగూడారు.

చౌదరికి గుర్తొచ్చింది రాత్రి వచ్చినప్పుడు తనని చుట్టుముట్టిన జనమే ఇప్పుడు తనదిక్కు చూడడం లేదు. మనసును కుళ్లబొడుస్తున్నట్టుంది. వెనకసీట్లో తను ఎడారిలో ఉన్నట్టున్నాడు.

వాళ్ళంతా నమస్కారాలు చెప్తున్నారు. తనకికూడా చెప్తున్నారు.
ఆ నమస్కారాలు చౌదరిని మరింత అవమానపరుస్తున్నాయి
కారు కదిలింది.
జనం ఆ కారును నడిపిస్తున్న మనిషి జాడను చూస్తూ నుంచున్నారు.
పాములు పుట్టల్లోకి పోయాయి. పక్షులు చెట్లకొమ్మల పైకి పోయాయి.

* * *


## సోషలిస్టు పబ్లికేషన్స్ అడ్రసు మార్పు

భారతదేశ విముక్తికి తోడ్పడే మార్క్సిస్టు విప్లవ సాహిత్యాన్ని కొన్ని సంవత్సరాలుగా అనేక వ్యయప్రయాసలకోర్చి పీడితప్రజలకు అందిస్తున్న మా సంస్థపైన అభివృద్ధినిరోధకప్రభుత్వం కక్షబూని దాడి చేసిన విషయం ఆంధ్రప్రజలకు తెలిసిందే. ప్రభుత్వ దాడిమూలంగా వచ్చిన యిబ్బందులవల్ల షాపును దిగువ అడ్రసుకు మార్చటమైనది. ఇకమీదట ఉత్తరప్రత్యుత్తరాలు దిగువఅడ్రసుతో జరపవలసిందిగానూ, యథావిధిగాసంస్థతో సహకరించవలసిందిగానూ పాఠకులనుకోరుతున్నాం.

ఇట్లు,
సోషలిస్టు పబ్లికేషన్స్,
పబ్లిషర్స్ అండ్ బుక్‌సెల్లర్స్,
పెనుమాక (P.O.) గుంటూరు జిల్లా.

# భారతీయ తత్వశాస్త్రం - ఒక పరిశీలన

## 'ప్రజల చారిత్రిక దశలకు సంబంధంలేని తాత్విక చర్చలు మార్క్సిజానికి విరుద్ధం'

నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు

భారత కమ్యూనిష్టుపార్టీ ఆంధ్రశాఖ దినపత్రిక 'విశాలాంధ్రకు' ప్రధాన సంపాదకుడుగ పనిచేస్తున్న శ్రీ యేటుకూరి బలరామమూర్తిగారు 'భారతీయ తత్వశాస్త్రము' అనే పుస్తకాన్ని ప్రచురించారు. దీనికి పరిచయం వ్రాస్తూ శ్రీ మద్దుకూరి చంద్రశేఖర రావుగారు గ్రంథకర్తను గురించి ఇలా వివరించారు.

"శ్రీ యేటుకూరి బలరామమూర్తిగార్కి రాజకీయ అధ్యయన తరగతులు నడుపుటలోను, తత్వశాస్త్రాలను బోధించుటలోను ఎంతో అనుభవముంది. వారు భారతీయ తత్వశాస్త్ర గ్రంథాలను జాగ్రత్తగ అధ్యయనం చేశారు. భారతీయ తత్వశాస్త్ర సూత్రాలను, వివిధ పోకడల పరిణామాన్ని, మార్క్సిష్టు దృక్పథాన్నుండి పరిశీలించుచు "సందేశం" పత్రికలో వ్యాసాలు వ్రాశారు. వాటినే పరిదిద్ది, ఈ పుస్తకరూపంలో ప్రచురిస్తున్నారు" అని వ్రాశారు.

మార్క్సిష్టు పరిశీలన అని పేర్కొనుటతో, ఈ పుస్తకాన్ని ఎంతో వుత్సాహంతో చదవటం జరిగింది. ఐతే దీనిలో జాతీయవాద ధోరణులు మార్క్సిష్టు వ్యతిరేక ధోరణులున్నట్లు నాకు తోచినందున, అదే 'సందేశం' 1-57 డిశంబరు సంచికలో వాటిని కొంతవరకు తెలియజేయటం జరిగింది.

రచయిత, తిరిగి 1961 నవంబరులో అదే పుస్తకం, మూడో ముద్రణను ప్రచురిస్తూ శంకరుడు, అరవిందో, గాంధీ, తిలక్, భగవద్గీతలను గురించి మరి కొంత సమాచారాన్ని కలిపి, పుస్తకం సంపూర్తి చేయగల్గానని సంతృప్తి ప్రకటించాడు. దీనిలో తనతప్పులు సరిదిద్దుకోటానికి బదులు, హెచ్చించటం జరిగింది. అదేతప్పులతో ఇపుడు నాల్గోముద్రణ కూడ వెలువడింది. అందుచేత, ఈ పుస్తకంపై పరిశీలన జరిపి ప్రజల ముందుంచటం తప్పనిసరి ఐంది.

### గతితార్కిక భౌతికవాదం

'గతితార్కిక భౌతికవాదం' మార్క్సిష్టుల తాత్విక పునాది. దీన్ని మార్క్స్ ఏంగిల్సులు అభివృద్ధిచేయుటం కాదు, కనిపెట్టారు. వీరు దీన్ని అభివృద్ధిచేశారు అ

అంటే, అంతకుముందే ఈ సూత్రాలు అమల్లోవున్న వాటికి వీరుకొంత చేర్చారు అని. అంటే అది పరిమాణాత్మక మార్పు (quantitative change) ఔతుంది కనిపెట్టటం అనేది 'గుణాత్మక మార్పు' (qualitative change). ఇచట స్పష్టంగ గుర్తించవలసిన ప్రధాన విషయమేమంటే, మార్క్స్ ఏంగిల్సులు గతితార్కిక భౌతికవాదాన్ని అభివృద్ధిచేయలేదు. కనిపెట్టారు.

“మార్క్స్ ఏంగిల్సులకు ముందు గతితార్కిక సూత్రాల నెవరూ చెప్పలేదు— పురాతన చారిత్రక, సాంఘిక పరిస్థితుల్లో ఎచటనైన 'గతితర్కం' చెప్పబడివుంటే అది 'యాదృచ్ఛికం' (something spontaneous) మాత్రమే. అది పూర్తి సిద్ధాంతంగ మారలేకపోయింది. ప్రపంచాన్ని గురించి వివరించలేకపోయింది. అందుచేత చివరకు అగతితర్కం 'జడవాదం'తో కలిసిపోయింది” అన్నాడు మావో ('వైరుధ్యాలు' పే. 8)

మార్క్స్. ఏంగిల్సులే స్వయంగ చెప్పారు “మాతో. పాతతాత్విక ధోరణులన్నీ అంతమే (గోరీ)” అని.

మార్క్స్ ఏంగిల్సుచే కనిపెట్టబడ్డ (a genuine discovery) ఈ విప్లవ సిద్ధాంతం యొక్క 'గుణాత్మక మార్పు'ను గుర్తించిన వారెవరూ దీన్ని, పాత తాత్విక ధోరణుల సరసన చెప్పబూనటంగాని, లేక పాతవాటితో పోల్చి చెప్పటంకాని చేయరు. చేయకూడదు ఎందుచేత? తత్వశాస్త్రమనే పాత అర్థం దీనికేమాత్రం వర్తించదు. పాతవాటికి పూర్తిభిన్నమైన 'శాస్త్రీయ సామాజికశాస్త్రం - ఆర్థిక, రాజకీయ, సామాజిక ప్రకృతి శాస్త్రాలనన్నిటిని జీర్ణించుకొని, సరైన దృక్కోణం నుండి కలిపి చూడగల్గిన ఒక క్రొత్త 'శాస్త్రం'. పాత సిద్ధాంతాలన్నీ పండిత చర్చ (శాస్త్రార్థాలు) కుపకరించే సాధనాలు. కాని ఈక్రొత్తశాస్త్రం 'ఆచరణకు' సంబంధించింది. ప్రకృతి సూత్రాలను సామాజిక సూతాలను. సరైనపంథాలో అర్థంచేసుకొని. ప్రకృతి మానవకల్యాణాని కనుగుణంగ మార్చటాని కుపకరించేది. పాతవన్నీ మైనారిటీవర్గాల కుపకరించేవి. ఈ క్రొత్తశాస్త్రం మానవ సమాజపు మొత్తాని కుపకరించేది. ఈరకమైన విప్లవ సిద్ధాంతాన్ని పాత, స్వార్థ తాత్వికచింతనల సరసన కలగాపులగంచేసి (blurring) చూపించటం, మార్క్సిజాన్ని 'రివైజ్' చేయబూనటమే ఔతుంది. అదేచేశా డీరచయిత.

“చరిత్రలోని ఒక నిర్దిష్టదశలో జడవాదం తలెత్తింది. అలాగే, మరొక నిర్దిష్ట దశలో గతితార్కిక భౌతికవాదం పుట్టింది” అన్నారు శ్రీ బలరామమూర్తిగారు (పే.5)

జడవాదం ఎలా తలెత్తిందో, గతితార్కిక భౌతికవాదం కూడ అలాగే పుట్టిందంటూ, రెంటినీ ఒకే అంతస్తులో చూపిస్తూ, వీటిమధ్య భేదాన్ని 'మసక' (blurr)

చేయ బూనటమే చరిత్రను తారుమారు చేయడం ('రివిజనిజం'). పరిమాణాత్మక, గుణాత్మక మార్పుల మధ్యభేదాన్ని ఈ రచయిత, ఈ పుస్తకం పొడవున లక్ష్యపెట్ట లేదనే సత్యాన్ని. 'ఇది మార్క్సిస్టు పరిశీలన' అనే అగ్‌మార్కు సర్టిఫికేట్ ఇచ్చేవారైనా, కనీసం గుర్తించి యుండవలసింది.

'పాజిటివిస్టు' ధోరణులు

'పాజిటివిస్టు' ధోరణులంటే ఏమిటి? పాతభావ వాదాలను, క్రొత్తమాటలతో, క్రొత్తపరిస్థితుల కనుగుణంగ అమెరికా, యూరప్ దేశాల్లో ప్రచారంలోపెట్టబడ్డ ధోరణులు. భావవాదాల యొక్క అంతిమ అవతారం.

తిరిగి గతితార్కిక భౌతికవాదాన్ని ఈ భావవాదాల సరసన చేర్చాడు. మార్క్సు ఏంగిల్సులను బూర్జువా వేదాంతుల సరసన నిలబెట్టాడు.

"జర్మన్ తత్వవేత్త హెగెల్, కాంట్‌లు 'భావవాద'శాఖకు అగ్రగణ్యులు.

"ఫ్రెంచి తత్వవేత్తలు డైకార్ట్, డిడిరోలు 'భౌతికవాద' శాఖకు చెందినవారు.

"బ్రిటిష్ తత్వవేత్తలు బేకన్, లాక్, స్పెన్సర్లు-భౌతిక వాదానికి సన్నిహితంగ వుండే 'అనుభవవాద' శాఖకు చెందినవారు.

ఈ మూడూకాక, గతితార్కిక భౌతికవాదం, మార్క్సు, ఏంగిల్సుల కృషిఫలితంగా 19 శతాబ్దంలో వృద్ధిచెందింది.

బ్రిటిష్ తత్వవేత్త రసెల్, ప్రొఫెసర్ అయిర్ మొదలైనవారు 'పాజిటివిష్టు శాఖకు చెందినవారు." (పేజి 219, 220)

ఇచట భావ, భౌతిక, అనుభవవాద, పాజిటివిష్టు ధోరణుల వరుసలో 'గతితార్కిక భౌతికవాదం' చేర్చటం జరిగింది; మార్క్సు, ఏంగిల్సు, లెనిన్‌లు—హెగెల్, కాంట్, రసెల్ సిద్ధాంతాలపై కొన్నివేల పేజీల విమర్శక బోధలను మన కందించిన అనంతరం, ఆ విషయాన్నొక్కముక్కకూడా ప్రస్తావించకుండ వదిలేయటం మార్క్సిజానికి పెద్ద అపచారమే ఔతుంది. రస్సెల్, అయిర్‌ల 'నిర్దిష్ట (positive) ధోరణులకు, మార్క్సు ఏంగిల్సుల భౌతికవాదానికి, మూలభేదాన్ని (basic diffrence) గుర్తించకుండ, వాటి ప్రస్తావన తీసుకరావటం పెద్దతప్పు.

తాత్విక సరిహద్దు

"తత్వశాస్త్రానికి జాతీయ ప్రాంతీయ సరిహద్దులేవు" అంటూ, యూరప్ అమెరికాల్లోని భావవాద ధోరణులన్ని ఒక ప్రత్యేక హెడ్డింగ్‌పెట్టి వివరించారు. కాని

పుస్తకం మొత్తం తిప్పినా 'గతితార్కిక భౌతికవాదం' అనే హెడ్డింగ్ లేదు. భారతీయ భక్తి ధోరణులకొక ప్రత్యేక అధ్యాయం వుంది. భగవద్గీత కొకటికంటె హెచ్చు అధ్యాయాలిచ్చాడు. ఐనపుడు మార్క్సిష్టు తాత్విక ధోరణి నెందుకు వదిలేశాడు? ప్రత్యేకంగ వివరించకుండ, మధ్య మధ్యలో ముక్కలు ముక్కలుగా చెప్పటం పెటీ బూర్జువా పిరికితనమే కారణమైవుండాలి. హెచ్చు పుస్తకాలమ్ముడుపోవనే భయంకూడ కావచ్చు. లేనియెడల యూరప్‌లోని భావవాద ధోరణులతోపాటు వాటిపై గతితార్కిక భౌతికవాద పోరాటాన్ని వివరంగ చెప్పి వుండాల్సివుంది.

## భారతీయ తాత్విక ధోరణులు

"చారిత్రక పరిణామక్రమంలో జడాత్మకపద్ధతికి ఒక సాంఘిక ప్రయోజనముంది" (పే. 53) అంటూ, ఆ ప్రయోజనమేమిటో వివరించలేదు. ఉపనిషత్తుల భావవాదాన్ని చార్వాకుల భౌతిక వాదాన్ని ఒక గాటన కట్టేశాడు. ఈ రెండు ధోరణులు సమాజంలోని ఏ వర్గాలయొక్క సంఘర్షణ రూపాలో చూడలేర. చార్వాకుల వాదం సాంఘిక అరాచకాన్ని ప్రోత్సహించిందనికూడ అన్నాడు. బౌద్ధమతం, బానిసవిధానాన్ని కూల ద్రోసిన మహాశక్తిగా వర్ణించాడు. అంటే, సాంఘిక చైతన్యం, సాంఘిక స్థితిని మార్చిందని చెప్పబూనటం మార్క్సిష్టు వ్యతిరేక ధోరణి.

భగవద్గీత నిష్కామవాదం, అరవిందుని 'అతీత మానవవాదం' తిలక్ కర్మవాదం, గంధీగారి 'అకర్మ'వాదం, ఆఖరుకు భారతీయ భక్తిధోరణులు సైతం, భారతీయ సమాజానికి ఆయాకాలాల్లో మేలుచేసినట్లు వివరించాడు. శంకరాచార్యుల భావవాదం, దేశాన్ని ఐక్యం చేయటానికి దోహదకారి ఐందన్నాడు. వైష్ణవభక్తినుండి పైన చెప్పిన శిథిలజీర్ణ ధోరణులు మాత్రమేగాక, ఆరోగ్యకరమైన సంస్కరణలు కూడా తల ఎత్తాయన్నాడు. (పే. 156)

బలరామమూర్తిగారి మహాగొప్ప మార్క్సిష్టు సూత్రీకరణ మేమంటే, "2500 సంవత్సరాల నాడు జన్మించిన గౌతముడు, గతితార్కిక సూత్రాల్లోని ప్రధాన హంశాలను, ఆనాటికే ప్రతిపాదించాడని స్పష్టం కాగలదు" అన్నాడు (పే. 8, 58)

ఏమాత్రం శాస్త్రీయపరిజ్ఞాన మున్నవారైనా ఈ నిర్ణయానికి రావటానికి వీల్లేదు. గౌతమబుద్ధుని కాలానికి, మానవసమాజం సంతరించగల్గిన ప్రకృతిశాస్త్రాలస్థాయిగాని, సామాజిక శాస్త్రాల అనుభవంగాని, గతితార్కిక సూత్రాల్లోని ప్రధాన హంశాలను వివరించలేవు. ఆఖరుకు మార్క్సు, మావోలు ఆనాడే పుట్టివున్నా వాటిని వివరించగల్గటం అసంభవం.

ఇదేనా మూర్తిగారి మార్క్సిస్టు పరిశీలన ?

మార్క్సిస్టు పరిశీలన ఎలా వుండాలి ?

భారతీయ తాత్విక ధోరణులను, మార్క్సిస్టు దృక్కోణం నుండి పరిశీలించట మంటే ఏమిటి ?

నేడు ప్రపంచమొత్తంగ శాస్త్రజ్ఞానాభివృద్ధి ఎంతవేగంగ పరుగిడుతోందో, అంత వేగంగ భావవాద ధోరణుల డొల్లతనం (Shallowness) బట్టబయలైపోతోంది. ఐనా రంగులుమార్చి, అనుభవవాదమని, అతీతమానవ వాదమని నిర్దిష్టవాదమని, విశ్వ మానవ మతమని రకరకాల పేర్లతో యూరప్, అమెరికాల్లోనేకాక, భారతదేశంలో సైతం, భావవాదం బ్రతకాలని ప్రయత్నిస్తూనేవుంది. కాని ప్రపంచమానవ అవసరాలు, భౌతిక శాస్త్రాభివృద్ధి భౌతికవాదం వైపు అమితవేగంగ పరుగిడుతున్నాయి. అందుచేత గతితార్కిక భౌతికవాద మొక్కటే ప్రపంచమానవాళికి వెలుగుదీపమైంది. మార్క్సిస్టుల ఈ తత్వశాస్త్రాన్ని, ఇప్పటికే ప్రపంచంలోని అధికభాగం గుర్తించారు. ప్రపంచమాన వాళిలో భారతీయ ప్రజలు ఒకభాగమని గుర్తించగల్గిన అభివృద్ధికాముకులు, వారితాత్విక చింతనకూడ, ప్రపంచ తాత్వికచింతనలో భాగంగ అర్థం చేసుకోగలరు.

వేదాల దగ్గరున్నుండి, ఉపనిషత్తులు, చార్వాకులు, బౌద్ధులు, జైనులు, శంకరులు మీదుగ, అరవిందయోగి వరకు ప్రవహించిన భారతీయ తాత్వికధోరణులు, శాస్త్రీయ భౌతికవాద ధోరణి కెంతచేరువగ వచ్చిపోయాయి లేక ఎంతవరకు తోడ్పడ్డాయి ? అనేది పరిశీలించాలి, భారతీయ భావవాదము, భౌతికవాదముల యొక్క ఘర్షణ ఏ రూపంలో నడిచింది ? ఆయాకాలపు సమాజాల్లోని, ఏయేవర్గాల ప్రజలు, ఏయేధోర ణులను బలపర్చారు? లేక ఎదిరించారు ? ఈ వర్గపోరాటాల ప్రభావం నాటి చరిత్రపై ఎలాంటి ప్రభావాన్ని కల్గించింది ? ఆయాకాలాల్లోని రిపబ్లిక్కులు, రాచరికాలు ఏయే పాత్రలు ధరించాయి ? ముఖ్యంగా; భారతీయ, భావ భౌతికవాదాల మధ్య సంఘర్షణ చిత్రపటాన్ని విడమర్చి చూపించటమే భారతీయ తత్వశాస్త్ర పరిశీలన ఔతుంది.

ప్రతి ధోరణియొక్క భౌతిక బునాదిని వదలి తాత్విక ధోరణిని విడదీసి చూప రాదు. భారతీయ తాత్విక ధోరణుల మధ్యనున్న సంబంధాలను వాటి బునాదులతో సహా సజీవంగచూపుతూ, మొత్తం పరిణామాన్ని చారిత్రిక దశలననుసరించి, చూపించాల్సి వుంటుంది. ప్రజల చారిత్రిక దశలకు సంబంధంలేని తాత్విక చర్చలను (బూర్జువా పండితులు చేస్తారుతప్ప) మార్క్సిస్టు పరిశీలకులు చేయరాదు.

భావవాదమా? భౌతికవాదమా- అంతర్జాతీయ దృష్టి-

భారతీయ తత్వశాస్త్ర పరిశీలనకు పూనుకున్న రచయిత, అంతటితో ఆగలేదు నేటి ప్రపంచం, పెట్టుబడిదారీ సోషలిష్టు కూటములుగ విడివడి పరిణామంచెందుతున్న తరుణంలో, యూరోపీయన్ పెట్టుబడిదారీ దేశాలైన ఇంగ్లండు ఫ్రాన్సు దేశాల తత్వ శాస్త్రిలను అమెరికన్ భావవాదాలను పాఠకులకు పరిచయంచేశాడు ఈ పాశ్చాత్య ధోరణులకొక ప్రత్యేక అధ్యాయాన్ని కేటాయించి వివరించాడు.

మూర్తిగారి అంతర్జాతీయ తత్వం, రష్యా, చైనా, తూర్పు యూరోపీయన్ దేశాలైన సోషలిష్టు సమాజాలకు సంబంధించిన తాత్విక ధోరణులనుగాని, ఆ సమాజాల అభివృద్ధిని గురించిన వివరణగాని చేయలేదు. గతితార్కిక భౌతిక వాదానికొక అధ్యాయం లేకుండ పుస్తకం పూర్తి చేశానని చెప్పుకోవటం యాదృచ్ఛిక మౌతుందా?

పైగా ఒక కూటానికి చెందిన ధోరణులను వివరించేపుడు వాటి వర్గ బునాదినిగాని వాటిపై మార్క్సిష్టు విమర్శనుగాని ఇవ్వలేదు

జర్మన్ బూర్జువా ప్రతినిధులైన కాంట్, హెగెల్ భావవాద ధోరణులతో మార్క్సు, ఏంగిల్సులు రాజీలేని పోరాటం జరిపి, ఆ సిద్ధాంతాలను వులికి వులికి ఆరవేసిన అనంతరం, తిరిగి మూర్తిగారు ఎవరి ధోరణులను, ఏరూపంలో, నేటి ప్రజలకు పరిచయం చేస్తున్నారు. నాటి ధోరణులను నేడు తిరిగి ఎందుకుగెలికి బయటకుతెచ్చాడు?

మతసిద్ధాంతాలను అమ్ముకొని బ్రతికే వ్యాపారులే రస్సెల్, డ్యూయీ అండ్ కంపెనీ అని లెనిన్ ఏనాడో స్పష్టంగ వివరించాడు, తిరిగి అదే కంపెనీ ముప్పాత సరకును, మార్కెట్లోకి తెచ్చి, మన ముందుంచుటలో వుద్దేశ్యమేమిటి? వీరినిగురించి లెనిన్ చేసిన విమర్శను అందించకపోవటం మార్క్సిష్టు లక్షణంకాదు.

అమెరికన్ 'ప్రాగ్మాటిష్టు'లైన, విలియం జేమ్సు, జాన్ డీలీల, డాంక్ నోట్లతత్వ ధోరణులను పాఠకుల కందిస్తున్న ఈ పుస్తకం, ఈ ధోరణులు ప్రజల కెలానష్టమో వివరించిన 'మౌరీస్ కారన్ ఫోర్తు'లాంటి వారి విమర్శలను ఎందుకు వదిలేసినట్లు? తన పాఠకునిలో ఏ అభిప్రాయం కలగాలని కోరుతున్నారో దీనివల్ల విదితమౌతోంది.

మార్క్సిష్టు వ్యతిరేక పోరాటానికి రాజకీయ కేంద్రాలైన అమెరికా ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు దేశాల్లోని బూర్జువా తత్వశాస్త్రిల వర్గస్వభావాన్ని విమర్శించకుండ, వాటిని ఆధునిక ధోరణుల క్రింద చెప్పాడు. ఆ చెప్పటంకూడ, నెమ్మదిగ, మెత్తగ నేటి ప్రజలకు అందించి, వాటిపై మార్క్సిష్టుల, విమర్శను అందించకుండ వూరుకోవడం, మార్క్సిజాన్ని న్యూనతపర్చడమే.

( ఇంకా వుంది )

## సాహిత్యంలో విప్లవోద్యమం

### కొడవటిగంటి కుటుంబరావు పుస్తకంపై
### ఏటుకూరి బలరామమూర్తిగారి విమర్శకు జవాబు

1971 డిసెంబరు 5వ తేదీన విశాలాంధ్ర వారపత్రికలో "విప్లవం-మార్క్సిజం ముసుగులో సర్వవిధ్వంసకవాదం" అనే పేరుతో శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు రాసిన "సాహిత్యములో విప్లవోద్యమం" అనే గ్రంథంపైచేసిన విమర్శ చదివాను, అంతకుముందే ఆ గ్రంథముపై కొన్నిదినపత్రికలలో ప్రకటించపబడిన విమర్శలుకూడా చదివాను. వాటిలో చాలా భాగంకాదు దాదాపు అవి అన్నీ ఆ గ్రంథంయొక్క ఔన్నత్యాన్ని మాత్రమే వివరించాయి. నేనా పుస్తకం చదివి నప్పుడు అందులో మార్క్సిజానికి వ్యతిరేకమయిన సూత్రీకరణలుకూడ అచ్చటచ్చట వున్నట్లు భావించాను. సిద్ధాంత సంబంధమయిన సూత్రీకరణలు చేసేటప్పుడు చాలా జాగ్రత్త తీసుకోవాలి లేకుంటే అనేక వక్రీకరణలకు ఆస్కారమవుతుంది. అంతేగాక ఆచరణలో అది అనేక పెడదారులకు దారితీస్తుందికూడ. ఈ విషయాన్ని శ్రీ కుటుంబ రావుగారికి తెలియ పర్చుదామనుకున్నాను కాని అశ్రద్ధవల్ల ఆ పని జరుగలేదు. యీ లోగా బలరామమూర్తిగారి విమర్శ వచ్చింది పై గ్రంథాన్ని గురించి నా దృష్టిలో ఏ లోపాలున్నాయో అవి తప్పకుండా వీరి విమర్శకు గురిఅవుతాయనుకున్నాను కాని అలాంటిదేమి జరుగలేదు సరికదా పై గ్రంథములో ఏ ఏ సూత్రీకరణలు మార్క్సిజా నికి వ్యతిరేకముగా వున్నాయని నేను భావించానో అవన్నీ, బలరామమూర్తిగారి దృష్టిలో సవ్యంగానే వున్నాయి అయినా విమర్శ కటువుగానే కొనసాగింది. అందు లోనేవుంది వైరుధ్యం.

యిక బలరామమూర్తిగారి విమర్శను పరిశీలించుదాం వారు రాశిన విమర్శ విశాలాంధ్ర వారపత్రికలో ఒక పూర్తి పేజి పట్టింది. జనరల్‌గా ఆ వ్యాసంఅంతా చది వితే మొదటి కాలంలో కుటుంబరావుగారి గ్రంథములోనుండి పేర్కొన్న తొమ్మిది ఉల్లేఖనాలను చివరి కాలంలో కొన్ని ప్రశ్నలు అనే సబ్ హెడ్డింగ్‌క్రింద వ్రాసిన నాలుగు ప్రశ్నలు. జవాబులు మినహాయిస్తే మిగిలిన విమర్శ అంతా నక్సలైటు విప్లవ పంథాపైనా, మావో ఆలోచన పైనా కొనసాగినట్లు ఎవ్వరికైనా కనుపిస్తుంది.

వ్యాసం ఆరంభములో కుటుంబరావుగారి పుస్తకములోనుంచి పేర్కొన్న ఉల్లేఖనాలను తప్పనుకుంటున్నారో, రైటనుకుంటున్నారోకూడా ఆయన వ్రాయలేదు.

బహిరంగంగా నక్సలైటు పోరాట పద్ధతే విప్లవమని, అందుకు పూర్వరంగంగా సాంస్కృతిక విప్లవము నిర్వహించడం సాహిత్యములో విప్లవరచయితల బాధ్యతనీ కొ.కు. రావుగారు అనుకుంటున్నట్లు పేర్కొనడానికి తప్ప పై ఉల్లేఖనాలు గ్రంథంయొక్క లోపాలోపాలను తెలియపరచడానికి ఏలాఉపయోగిస్తాయో ఆ వ్యాసాన్నిబట్టి తెలియదు. కనీసం వారికి ఎబ్బెట్టుగానో, మార్క్సిజానికి వ్యతిరేకంగానో కనిపించగా పేర్కొన్న ఆ తొమ్మిది ఉల్లేఖనలనయినా సాకల్యంగా విమర్శించివుంటే కుటుంబరావుగారి గ్రంథములోని లోపాలోపాలపట్ల బలరామమూర్తిగారి అభిప్రాయం పాఠకులకు స్పష్టమై వుండేది. వారు అలానూ చేయలేదు అందువల్ల ఆ వ్యాసం కుటుంబరావుగారిగ్రంథంపై విమర్శగా పేరుపెట్టబడినా ప్రధానంగా నక్సలైట్ల పోరాట పంథాపై లేదా మావో ఆలోచనపై విమర్శగానే కొనసాగింది.

నక్సలైట్లు అవలంబించే విప్లవ పంథాకూ బలరామమూర్తిగారు వుద్యోగంచేస్తున్న విశాలాంధ్ర పత్రిక, కమ్యూనిష్టుపార్టీ (రివిజనిష్టు) ల పంథాకూ చుక్కెదురని అందరికితెలిశవదే, నక్సల్‌బరీ పోరాటం ఆరంభమయిన దగ్గరనుండి ఆపోరాటాన్నీ ఆ పోరాటం వెనుకనున్న విప్లవ దృక్పథాన్ని విశాలాంధ్ర పత్రిక, కమ్యూనిష్టుపార్టీ (రివిజనిష్టు)లు తెగనాడుతూనే వచ్చాయి వుద్యోగధర్మంగా ఆదృక్పథాన్ని విమర్శిస్తూ బలరామమూర్తిగారు చాలా వ్యాసాలుకూడా వ్రాశారు అలానే మావో ఆలోచనా విధానాన్నీ, తాత్వికచింతననూ విమర్శించడానికికూడ ఆయనకు కావలశినంత స్వేచ్ఛ వున్నది. అయితే ఆ పనిచేయడానికి ఏదో ఒక గ్రంథాన్ని విమర్శించడాన్ని సాకుగా తీసుకోవలశిన అవుసరం మాత్రంలేదు.

యిక బలరామమూర్తిగారి విమర్శలోని ఒక్కొక్క విషయాన్ని వివరంగా పరిశీలించుదాము. కుటుంబరావుగారి గ్రంథంలో ఆయనకుకనుపించిన పెద్దలోపంయిది.

"నక్సలైటు పోరాట పద్ధతే విప్లవమని అందుకు పూర్వరంగంగా సాంస్కృతిక విప్లవం నిర్వహించబడ్డం విప్లవ రచయితల బాధ్యత. అని కొ.కు. రావుగారి వాదన. ఈ విషయంలో బాపరికం ఏమీలేదు".

పై ఉల్లేఖనలో బలరామమూర్తిగారి వ్యతిరేకత ఎక్కడో అర్థంగాదు. నక్సలైటు పద్ధతే విప్లవ పద్ధతని కుటుంబరావుగారు అనుకోవడం తప్పా? లేక విప్లవానికి పూర్వరంగంగా సాంస్కృతిక విప్లవం నిర్వహించడం సాహిత్యంలో విప్లవ రచయితల బాధ్యత అని చెప్పడంలో తప్పుందా? బలరామమూర్తిగారు తానూ మార్క్సిష్టునేనని అనుకుంటారుగనుక విప్లవమంటూ జరిగితే దానికి పూర్వరంగాన్ని సృష్టించడానికి రచయితలు పూనుకోవాలనడాన్ని తప్పనలేరనుకుంటా. ఏ విప్లవానికైనా పూర్వరంగం

అందుకు అనుకూలమయిన వాతావరణాన్ని సృష్టించడమేకదా. అందులో రచయితల పాత్రి గణనీయమయినదేనని అంగీకరించడానికి బహుశా బలరామమూర్తిగారికి అభ్యంతరముండదు. కాబట్టి నక్సలైటుపోరాట పద్ధతే విప్లవమనే విషయంలోమాత్రమే వారి వ్యతిరేకతయివుండాలి. ఆయన విమర్శలోని ఏ పేరా చదివినా అదే విషయ్యం ధ్వనిస్తుంది. పాపం కుటుంబరావుగారిని భయపెట్టడానికో ఏమో నక్సలైటు పోరాట పద్ధతినే విప్లవమంటూ దాపరికం లేకుండా చెపుతున్నాడు సుమా అంటూ పరోక్షంగా బెదిరించారు కూడ అలాగే ఆ పంథాను సర్వవిధ్వంసక వాదమనడమే కాకుండా

"వి.ర.సం. కవులకు.... వ్యాసపీఠంలో వున్నారు".

"ఈ అంశాలను గుర్తించే ఓపిక కొకురావుకు లేదు"

"యిట్టి వ్యక్తి వి. ర. సం. కవులకు మార్గదర్శకుడు, సిద్ధాంతవేత్త. వీరి నేతృత్వంలో వి.ర.సం. కవులు విప్లవ సాహిత్యాన్ని సృష్టిస్తారు".

"అంధాః కూపం ప్రవిశంతి".

వగైరా, వగైరా మాటలలో కుటుంబరావుగారిని తిట్టాల్సిన బాపతుతిట్లన్నీ తిట్టారు కోపం పట్టలేక.

"వైరుధ్యాలపై మావో రచన మార్క్సిష్టు తాత్విక దృక్పథానికి అత్యున్నత రూపం అని కొకురావు భావన ఈవాక్యం చూడండి"

అంటూ బలరామమూర్తిగారు కుటుంబరావుగారి గ్రంథములోని ఈదిగువ వాక్యాలను పేర్కొన్నారు.

"మార్క్సుకు పారిశ్రామిక రంగంలోని కార్మికులే పైకిరావలసిన వర్గంగా కనుపించారు. లెనిన్ కార్మిక కర్షకులను జోడించారు. మావో ప్రధానంగా కర్షకవర్గంపై తన దృష్టినుంచారు. కాలాలనుబట్టి దేశాలనుబట్టి యిలా మార్పులు ఏర్పడ్డాయి" (పే 47)

"వైరుధ్యాల"పై మావో రచన మార్క్సిష్టు తాత్విక దృక్పథానికి అత్యున్నత రూపంగా కుటుంబరావుగారు భావిస్తున్నారనడానికి ప్రమాణంగా పై వాక్యాలు ఎలాపనికి వస్తాయో అనూహ్యం పై వాక్యాలకు వైరుధ్యాలపై మావో రచనపట్ల కుటుంబరావు గారికిగల అభిప్రాయానికి సంబంధం ఏమిటి? పై వాక్యాల ద్వారా కుటుంబరావుగారు చెప్పదలుచుకున్నదల్లా మార్క్సిజాన్ని దేశకాలాలకు అనుగుణ్యంగా లెనిన్, మావోలు సృజనాత్మకంగా అభివృద్ధి చేశారనేది మాత్రమే, వైరుధ్యాలపై మావో రచనను కుటుంబరావుగారు మార్క్సిష్టు తాత్విక దృక్పథానికి అత్యున్నత రూపంగా భావించిన

మాట నిజం. ఆ అభిప్రాయాన్ని ఆయన తనవ్యాసంలో స్పష్టంగానే చెప్పారు. అయితే అది చెప్పడంకొరకు పై వుదాహరణ బలరామమూర్తిగారి కేవిధంగానూ తోడ్పడదు.

కుటుంబరావుగారిపుస్తకం చదివినప్పుడు సరిగ్గా బలరామమూర్తిగారు పేర్కొన్న పై వాక్యాలే నాకు ఎబ్బెట్టుగా కనుపించాయి. ఆ సూత్రీకరణ మార్క్సిజానికి వ్యతిరేక మని కూడ నేను భావించాను. "కార్మికులే పైకిరావలసిన వర్గంగా కనుపించారు" అంటే కుటుంబరావుగారి భావమేమిటో అటుంచి పాఠకులందరికి అర్థమయ్యేది అభివృద్ధి చెంద వలసినవారుగా కనుపించారు అని. అయితే మార్క్సుదృష్టిలో పీడిత రైతాంగం అభి వృద్ధి చెందవలసినవారు కాదా? "అలానే లెనిన్ కార్మిక కర్షకులను జోడిస్తే మావో ప్రధానంగా కర్షకవర్గంమీద తనదృష్టి వుంచాడు" అంటే మావో దృష్టిలో కార్మికులు పైకి రావలసినవారు కారా? యిది అర్థంలేని, అవాస్తవికమైన సూత్రీకరణ. మార్క్సు, లెనిన్, మావోలకు లేనిపోని అబద్ధాలను అంటకట్టడమవుతుంది.

పోనీ పైకిరావలసినవారుగా కనుపించారంటే కుటుంబరావుగారిదృష్టిలో అధికార ములోకి రావలసినవారుగా కనుపించారని అర్థమా? అలా అనుకుంటే లెనిన్ కార్మిక కర్షకులిరువురూ సంయుక్తంగా అధికారంలోకి రావాలనిభావిస్తే, ఒక్క రైతులే అధికా రంలోకి రావలసినవర్గంగా మావో భావించారని సరిపెట్టుకోవాలి. అలా అనుకున్నా అదీ నిజంకాదు, మార్క్సిజానికి, లెనినిజానికి, మావోఆలోచనకు పై సూత్రీకరణపూర్తిగా విరుద్ధం.

అయితే కార్మిక కర్షకవర్గాలగురించి మార్క్సు, లెనిన్, మావోలు చెప్పిందే మిటి? ఉత్పత్తి సంబంధాలలో దానికున్నపాత్రరీత్యా సోషలిస్టు విప్లవములో అత్యంత విప్లవకరముగావుండేది కార్మికవర్గమేనని మార్క్సు చెప్పారు

వెనుకబడిన దేశాలలో జరిగే ప్రజాస్వామిక విప్లవాలలో అసంఖ్యాకముగావున్న రైతాంగాన్ని కదిలించవలసినబాధ్యత కార్మికవర్గంపైవుందనీ. రైతాంగాన్ని బూర్జువావర్గ ప్రభావమునుండి వేరుపరచకలిగి ప్రజాస్వామిక విప్లవములో కార్మికవర్గం నాయకత్వం వహించి అధికారాన్నిచేపట్టకలిగితే మరోవిప్లవం అవసరంలేకుండానే ఆ విప్లవం సోష లిష్టువిప్లవముగా పరిణితి చెందుతుందనీ లెనిన్ చెప్పారు.

అక్టోబరు విప్లవముతరువాత ప్రజాస్వామికవిప్లవాలలో రైతాంగానికి నాయకత్వం వహించేపాత్రను బూర్జువావర్గం కోల్పోయింది కనుక యికముందు ఆ పాత్రను నిర్వ హించవలసినబాధ్యత కార్మికవర్గంపైబడిందనీ, అలా కార్మికవర్గనాయకత్వంక్రిందజ్యగే

ప్రజాస్వామిక విప్లవాలుమాత్రమే జయప్రదమౌతాయనీ, మిగిలినవన్నీ తప్పక విఫల మౌడమేకాక ఏదో ఒక సామ్రాజ్యవాద అధిపత్యానికిగురియై అర్ధవలసదేశాలుగా పడి వుండకతప్పదనీ, అందువల్ల యికముందుజరిగే ప్రజాస్వామిక విప్లవాలన్నీ ప్రపంచ బూర్జువావిప్లవములో భాగముగాగాక ప్రపంచసోషలిష్టు విప్లవములో భాగముగా వుంటా యనీ, కాబట్టి యికముందు అలాంటి ప్రజాస్వామికవిప్లవాలను నూతన ప్రజాస్వామిక విప్లవాలని పిలవాలని చెయిర్మన్ మావో చెప్పారు. తద్వారా ఆయన నూతన ప్రజా స్వామిక విప్లవాలను సమగ్రంగా సిద్ధాంతీకరించారు.

యదార్థపరిస్థితి యిలావుండగా మార్క్సు, లెనిన్, మావోలలో ఒకరిని కార్మిక బాంధవులుగాను, మరొకరిని రైతు బాంధవులుగాను, వేరొకరిని వుభయవర్గ బాంధవు లుగా పేర్కొనడం సత్యదూరమేగాక ఆచరణలో అది అనేక వక్రమార్గాలకు బాట వేస్తుంది. అందువల్లి కుటుంబరావుగారి అభిప్రాయము సదుద్దేశముతో కూడుకున్నదే అయినా ఆయన వ్రాసిందిమాత్రం మార్క్సిజానికి పూర్తిగా వ్యతిరేకం.

అయితే కుటుంబరావుగారిపై సూత్రీకరణలో మన "తాత్వికాచార్యులు" బలరామ మూర్తిగార్కి కనిపించినదోషం యిది కానేకాదు. మావోమీద, మనదేశంలోని నక్స లైట్లమీదా ఏగడ్డదొరికినా విసరడానికి ఆత్రపడే రివిజనిష్టులందరి స్వభావానికి అనుగుణ్యం గానే కుటుంబరావుగారు మావో, లెనిన్‌లాగానే దేశకాలపరిస్థితులకు అనుగుణ్యంగా మార్క్సిజాన్ని, సృజనాత్మకంగా అభివృద్ధిచేశారని చెప్పబోయి ఏదోవ్రాస్తే, దాన్నే ఆధారం చేసుకొని, దొరికిందిరా ఛాన్సు అని చంకలు ఎగరేసుకుంటూ మావోపై రాళ్లు విసరటానికి పూనుకున్నాడు బలరామమూర్తిగారు. కోతి సజ్జలతిని సజ్జలే ఏరుగుతా యంటారు. అలానే బలరామమూర్తిగార్కి కూడ పుస్తకాలు ఎన్నిచదివినా, మార్క్సిజం వంటపట్టలే దనిపిస్తున్నది. కుటుంబరావుగారి పై సూత్రీకరణను వుపయోగించుకొని ఆయన యిలా వ్రాశారు.

"1960 తరువాత గత దశాబ్దంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమపరిణామా లను, మావో నాయకత్వాన చైనా విచ్ఛిన్నకరపాత్రనూ అధ్యయనంచేసిన మార్క్సిస్టు ఎవ్వరూ యిలా వ్రాయలేరు"

బలరామమూర్తిగారు పైన వ్రాసినదానికి అర్థమేమిటి? కుటుంబరావుగారు వ్రాసి నట్లు "ప్రధానంగా మావో కర్షకవర్గంమీద దృష్టివుంచాడు" అనే విషయాన్ని మార్క్సిస్టు అయినవాడు ఎవడూ వ్రాయలేడనా? ఇంతకూ కుటుంబరావుగారి పై స్టేటుమెంటు బలరామమూర్తిగారు తప్పనుకుంటున్నారో రైటనుకుంటున్నారో అదీ తెలియదు.

ఒకవేళ తప్పనుకున్నా విప్లవంలో ప్రధానంగా మావో కర్షకవర్గంమీద కేంద్రీకరించాడని కుటుంబరావుగారి స్టేటుమెంటును ఖండించడానికి అదెలా వుపయోగపడుతుంది.

తరువాత వాక్యంలో మరింత బలమైనదాఖలా చూపాలనుకొని ఆయన ఈదిగువ వాక్యాలు వ్రాశారు.

"మూలసూత్రాలను సరళ పరుస్తున్నాననేపేరుతో మావో తేలికపరిచాడు. చైనాకు వర్తింపచేస్తున్నాననే పేరుతో చైనీకరణ చేశాడు. యిందుకు బీజాలు 1940 ప్రారంభాల నుంచి వున్నాయి చైనాలో కార్మికవర్గ పాత్రను వుద్దేశ్యపూర్వకంగా తక్కువ అంచనా వేయడం అందులో ఒకభాగం"

చైనా విప్లవములో కార్మికవర్గపాత్రను మావో తక్కువ అంచనా వేశాడని బలరామమూర్తిగారు నొక్కి చెపుతున్నారు. అయితే ఎవ్వరి పాత్రను మావో ఎక్కువ అంచనావేసినట్లు? ప్రజాస్వామిక విప్లవములో ప్రధానభాగాలైన కార్మిక కర్షకవర్గాలలో కార్మికవర్గాన్ని తక్కువ అంచనావేస్తే కర్షకవర్గంపై ప్రధానంగా మావో ఆధారపడినట్టే కదా? అదే నిజమయితే అదేమాట రాసినందుకు "మార్క్సిస్టు అయినవాడెవడూ రాయలేడు అంటు న్యూనపరచడం దేనికి

పైగా కార్మికవర్గ పాత్రను మావో వుద్దేశపూర్వకంగా తక్కువ అంచనా వేశాడంటూ అలాంటి తప్పుదోరణులకు 1940 నుండీ బీజాలుపడ్డాయనికూడ బలరామమూర్తిగారి పై వాక్యాలలో వున్నది. అదెంత అబద్ధమో నేచెప్పేకంటే 1940 నుండి మావో రచనలనుండి సూటిగా యిక్కడ పేర్కొనడం అవసరమనుకుంటాను.

"చైనా పారిశ్రామిక కార్మికవర్గం సంఖ్యరీత్యా తక్కువగా వున్నప్పటికీ, అది అప్పటి నూతన వుత్పత్తిశక్తులకు ప్రాతినిధ్యం వహిస్తుంది కాబట్టి ఆధునిక చైనాలో అత్యంత అభ్యుదయకరమైన వర్గమేగాక విప్లవోద్యమములో అది నాయకత్వం వహించే శక్తిగా తయారయింది ... ... పారిశ్రామిక కార్మికవర్గం యీ స్థాయికి రావడానికి మొట్టమొదటి కారణం వారు కేంద్రీకరింపబడివుండడం, ప్రజానీకానికి చెందిన ఏ యితర భాగము వారిలాగా కేంద్రీకరింపబడిలేదు.

(చైనా సమాజంయొక్క విశ్లేషణ అను వ్యాసం నుండి)

"కాబట్టి కొన్ని అనివార్యమైన బలహీనత లున్నప్పటికీ, ఉదాహరణకు సంఖ్యరీత్యా తక్కువగా వుండడం, (రైతాంగముతో పోల్చుకుంటె) తగినంత వయస్సు లేకపోవడం, (ఐరోపాఖండపు కార్మికవర్గంతో పోలిస్తె) విద్యావిషయంలో తక్కువస్థాయిలో

వుండడం. (బూర్జువాజీతో పోల్చితె) చైనా కార్మికవర్గమే చైనా విప్లవములో ప్రధాన మయిన చలనశక్తి. కార్మికవర్గం నాయకత్వం వహిస్తేతప్ప చైనా విప్లవానికి విజయం చేకూరటం సాధ్యంకాదు".

(చైనా విప్లవం— కమ్యూనిస్టుపార్టీ అను వ్యాసము నుండి)

"జనతా ప్రజాస్వామిక విప్లవానికి కార్మికవర్గ నాయకత్వం అవసరం. ఎందు కంటే కార్మికవర్గం ఒక్కటే దూరదృష్టికలిగి, స్వార్థంలేకుండా, అత్యంత విప్లవకరంగా వుంటుంది. విప్లవంయొక్క చరిత్ర అంతా కార్మికవర్గం నాయకత్వం వహించకపోతే విప్లవం దెబ్బతింటుందని, అది నాయకత్వం వహిస్తే విప్లవానికి తప్పకుండా విజయం లభిస్తుందని రుజువు చేస్తుంది. సామ్రాజ్యవాద యుగములో ఏ దేశములోకూడ నిజ మయిన విప్లవాన్ని మరే యితరవర్గమూ విజయవంతము చేయలేదు. చైనాలో పెటీ బూర్జువావర్గము, జాతీయ బూర్జువావర్గము నాయకత్వం వహించిన ఎన్నో విప్లవాలు ఓడిపోవటం ద్వారా యీ విషయం స్పష్టంగా రుజువు అయినది"

(జనతా ప్రజాస్వామిక నియంతృత్వం గూర్చి అను వ్యాసం నుండి)

చైనా విప్లవములో కార్మికవర్గ పాత్రనుగూర్చి మావో స్పష్టీకరించిన పై అభిప్రా యాలు చూచిన తరువాత ఉద్దేశపూర్వకముగా చైనా విప్లవములో కార్మికవర్గ పాత్ర మావో తగ్గించివేశాడని ఇంగిత జ్ఞానమున్నవాడు ఎవడైనా అనగలడా? అయినప్పటికి బలరామమూర్తిగారు అలా రాశారంటే అర్థమేమిటి?

పత్రిక చేతిలో వుందిగదా అని పదేపదే అబద్ధాలు రాయగా రాయగా జనం నమ్మేస్తారనే గోబెల్సు సిద్ధాంతాన్ని ఆయన అమలుపరచ దలచుకునయినా వుండాలి. లేక కామెర్లరోగికి ప్రపంచమంతా పచ్చగా కనిపించినట్లు మావో పుస్తకాలన్నీ చదివినా బలరామమూర్తిగారి కళ్ళకు అలానే కనిపించి అయినా వుండాలి.

ఒకవైపున కార్మికవర్గాన్ని బుద్ధిపూర్తిగా మావో తక్కువ అంచనావేశాడని చెప్పుతూ రెండోవైపున "ప్రధానంగా కర్షకవర్గంపై కేంద్రీకరించాడని" రాసిన కుటుంబ రావును విమర్శించడం పరస్పరం విరుద్ధంకాదా? బలరామమూర్తిగారు ఈ అయోమ యావస్థలో ఎందుకుపడ్డట్లు. బహుశా ఆయనకు మావోపేరే యెలర్జిక్ అయివుండాలి. ఆపేరు చెవినిబడగానే చేతికి అందిన ఏవో నాలుగురాళ్ళు మావోపై విసరడం ద్వారా దురద తీర్చుకొనే ఆరాటంలో ఆయన విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయినట్టుంది, ఎంత దుర్గతి!

ఇక మావో తాత్వికచింతన విషయం. "అంతర్జాతీయ స్వభావంకలిగిన మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని చైనీకరణ చేశాడు"

"విరుద్ధశక్తుల ఐక్యత—ఘర్షణ" అనే మార్క్సిస్టు సూత్రంపేరు మార్చి "వైరుధ్యాలు" అని నామకరణం చేశాడు. ఐక్యత అనేమాటలేదు.

"మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని ఆధ్యాత్మికధోరణికి మార్చి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికేగాక చైనాలో సోషలిస్టు సమాజ నిర్మాణానికే తీరనిద్రోహం చేశాడు అనేది ప్రస్తుతాంశం"

మావో మార్క్సిజాన్ని వక్రీకరించాడని చెప్పడానికి ఇలాంటివే మరికొన్ని నిందలువేశారు. అయితే మావోరాసిన "వైరుధ్యాలు" అన్న గ్రంథంలో నుండిగాని మరో గ్రంథంనుండి యే ఒక్క ఉదాహరణనుకూడ ఆయన పేర్కొనలేదు. అలా పేర్కొనకుండా నోటికివచ్చిన విమర్శచేయడం సత్సాంప్రదాయమూ కాదు అలాంటి వాటికి సమాధానం రాయడంకూడ అర్థరహితం. ఆధారంలేని చర్చగా ముగుస్తుంది. ఉదాహరణకు ఈ ఒక్క విషయం చాలు. ఆయన ఇలా రాస్తున్నారు.

"ఈనాడు జాతీయ అంతర్జాతీయ రంగాలలో చైనా అవలంబిస్తున్న ప్రతివైపరీత్యానికీ బీజాలు మావో ఆలోచనలోనూ, మార్క్సిజానికి మావో ఇచ్చిన వక్రీకరణలోనూవున్నాయంటే చాలు"

మావోనేసిన వక్రీకరణ ఎలాంటిదో మావో గ్రంథాలనుండీ ఒక్క వుదాహరణ కూడ పేర్కొనకపోవడాన్ని ఇంతకుముందే చెప్పాను. కాని ఆ వక్రీకరణ ఫలితంగా జాతీయ అంతర్జాతీయ రంగాలలో చైనా అనుసరిస్తున్న వైపరీత్యాలుగా బలరామమూర్తి పేర్కొన్న సంఘటన లేమిటి ?

"కార్మికవర్గానికి తగు ప్రాధాన్యత ఇవ్వాలి. సోవియట్టుతో వైరం పనికిరాదన్న లీషావ్‌చీ, పదభ్రష్టుడయ్యాడు. కమ్యూనిస్టుపార్టీ దాదాపు ధ్వంసమయింది"

"తన మిత్రులపై దాడిచేసేందుకు సాంస్కృతిక విప్లవాన్ని మావో నిర్వహించాడు. ప్రాచీన మహారచయితల సమాధులను పెకలించి వారి మహాగ్రంథాలను దహనం చేశాడు"

ప్రపంచంలోని అభివృద్ధి నిరోధకులంతా పనిగట్టుకొని చైనాపై చేసిన చేస్తున్న రొచ్చుగుంట ప్రచారాన్నే అపరమార్క్సిస్టు బలరామమూర్తి నోటితో మళ్ళా చేస్తున్నాడుతప్ప పైనరాసిన విషయాలలో వాస్తవంలేదని కమ్యూనిస్టుఉద్యమంతో సంబంధం వుండే యే ఒక్కరైనా గ్రహించగలరు. అలాగే "సోవియటు వ్యతిరేకతను ప్రధాన కార్యాచరణగా చైనా చేస్తున్నది" అని వాపోతాడు బలరామమూర్తి. సోవియటు యూనియన్ సోషలిజానికి స్వస్తి రివిజనిస్టుగా మారిన తరువాత అది సామ్రాజ్యవాదం

కాకుండా మరేమవుతుంది? అమెరికన్ సామ్రాజ్యవాదంతో పాటు, రష్యా సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటించకుండా యే కమ్యూనిస్టు దేశమయినా ఎలా మనగల్గుతుంది?

బలరామమూర్తిగారూ! సోవియటు యూనియన్ అవలంభిస్తున్న పంథా రివిజనిస్టుపంథా కాదనీ, అదే అసలయిన మార్క్సిజమనీ మీరు ఉద్యోగం చేస్తున్న పత్రిక నిండా చెత్తచెత్తగా రాసుకోవచ్చు. మిమ్మలను అడ్డుకునేవారెవరూలేరు. తనుమునిగిందే గంగ అన్నట్లు మీరొకవైపు ప్రపంచమంతా రోసివేసిన రొచ్చుగుంటలో (రివిజనిజంతో) మునిగితేలుతూ, అది రొచ్చుగుంట అని పేర్కొన్న వారినందరినీ మార్క్సిస్టు వ్యతిరేకులని బజారువపడితే ప్రతిఘటన తప్పదు.

అయ్యా! మార్క్సిస్టు పండిత మహాశయా! దయవుంచి మీరురాసిన యీ దిగువ వాక్యాలకు మీకయినా తెలిస్తే అర్థం చెప్పగలరా.

"ఇందుకు కారణాలను పెతకాలంటే రాజకీయ పరిణామాలను, జాతీయ అంతర్జాతీయ ఘటనలను అధ్యయనం చేయాలి. వర్గకలయికను గ్రహించాలి. వర్గశక్తులలో మార్పురావడం అంతతేలికకాదు అందున చైనాలాంటి పెద్దదేశం తనదుందుడుకు విధానం ద్వారా ఆసియాలోని పెక్కుదేశాలలో విప్లవోద్యమాలను చీల్చి చరిత్రను ఒక దశాబ్దం వెనక్కునెట్టిన పరిస్థితిలో ఇది మరీకష్టం".

చైనా బెడదలేకపోతే యీపాటికే ఆసియా దేశాలన్నిటిలోనూ, మన దేశంలోనూ వర్గకలయికను గ్రహించగలిగి వుండేవారమంటారా? అసలీవర్గకలయిక ఎక్కడపట్టారు స్వామీ, ఈవర్గకలయికయే మార్క్సిజంలో వుంది? వర్గకలయికను గ్రహించడం "వర్గశక్తులలో మార్పుతేవడం" ప్రస్తుతానికి భారతప్రజల కర్తవ్యమయినట్టూ చైనావారి బెడదమూలంగా అద పై కర్తవ్యాన్ని సాధించడంలో తమటోంట్లు చిక్కున పడుతున్నట్టూ రాస్తున్నా గదా. ఇంతకంటే పతనమూ, మార్క్సిజానికి వ్యతిరేకమూ ప్రపంచంలో మరింకేముంటుంది? ఇంకా సిగ్గువిడిచి పై అప్రాచ్యపు పని జరగకుండా మీకు అడ్డుపడుతున్న చైనా కమ్యూనిష్టుపార్టీ మార్క్సిజాన్ని వక్రీకరిస్తోందని కాకిగోల దేనికి? మహాశయా మార్క్సిజం పేరుతో ఇలాంటి బూర్జువా ప్రచారాన్ని యికనయినా కట్టిపెడితే మంచిది.

తన విమర్శముగిస్తూ చివరికాలంలో బలరామమూర్తిగారు రాసిన ఒకటి రెండు విషయాలు ప్రస్తావించి యీవ్యాసం ముగిస్తాను. "కొన్నిప్రశ్నలు" అదే సబ్ హెడ్డింగు కింద కుటుంబరావుగారికి వేయబడిన కొన్నిప్రశ్నలు, అందుకు వారి సమాధానాలు రాశారు బాగానేవుంది. అలా రాయడం ద్వారా కుటుంబరావుగారు రాతలకూ, చేతలకూ సంబంధంలేని మనిషి అని చెప్పాలని ఆయన అభిప్రాయం. అదికూడ బాగానే

వుంది. ఒక్క బలరామమూర్తిగారికే కాదు. వి.ర.సం. సభ్యులలోనూ, పాఠకుల లోనూ చాలమందికి వారి సమాధానాలు నచ్చలేదు. ఉల్లిపాయ తినవద్దని శిష్యులకు చెప్పి, ఉల్లిపాయ కూరలో వేయనందుకు పెళ్ళాన్నితిట్టిన పంతులుగారి తంతులాగా వుంది కుటుంబరావుగారి వ్యవహారం అని అలాంటివారంతా అనుకున్నారు. మిత్రుడు టంకసాల అశోకు అప్పుడే నిస్సంకోచంగా పత్రికాముఖాన కుటుంబరావుగారి ధోరణిని ఖండించారు కూడ. అది చూశాకనయినా వి.ర.సం. వారికి కుటుంబరావుగారు వ్యాస పీఠంకాదని గ్రహించవచ్చు. ఒక్క కుటుంబరావుగారే కాదు మరేవ్యాసపీఠాన్నీ గుడ్డిగా విప్లవకారులెవ్వరూ గుర్తించరనే ప్రాథమిక విషయంకూడ తెలియని అయోమయ స్థితిలో బలరామమూర్తిగారున్నందుకు విచారపడ్డం తప్ప చేయగల్గిందిలేదు.

కుటుంబరావుగారి బలహీనతలను ఎత్తిచూపాలనే ఉద్దేశ్యంతో పై "కొన్నిప్రశ్న లను" పేర్కొన్న బలరామమూర్తిగారి విమర్శ చూడండి.

"తమ విషయంలో ఇంత ఔదార్యం చూపుతున్న కొ.కు.రావు ఇతరుల విష యంలో అందులో ఒకశాతమన్నా ప్రదర్శిస్తారా?"

ఎంత పాథటిక్ అప్పీలు బలరామమూర్తిగారూ! పై విషయాలలో కుటుంబ రావు ప్రదర్శించిన బలహీనతపై మీకు అసహ్యం ఈషణ్మాత్రం లేదు. మీ తపనల్లా మీ బలహీనతల్నికూడ అలాంటి వాదనలతో కప్పిపెట్టుకోడానికి తగూలేకుండా అను మతించమని. పైగా అలాంటి సమాధానాల్ని సహజమంటూ వెంటనే జవాబురాసిన టంకసాల అశోక్‌లాంటివారు ఎంతోమంది వి.ర.సం. లో వున్నారనే ఆలోచనకూడ లేకుండా వి.ర.సం. వారిని వ్యాస పీఠంయొక్క అంధానుయాయులుగా చిత్రించడానికి సిగ్గేలాలేదో బోధపడదు.

ఆయన తన వ్యాసాన్ని ముగిస్తూ వి.ర.సం. అనతికాలంలోనే విఫలమయితీరు తుందని శాపనార్థం పెట్టారు. విప్లవ రచయితల సంఘం యేర్పడే సమయంలో జరిగిన రభస సందర్భంలో కూడ ఆయన సహనాన్ని, విజ్ఞాయితీని, నిగ్రహాన్నీ కోల్పోయి చవకబారు, బజారువిమర్శలతో చాలారాశారు. వాటన్నిటిలో ఇలాంటి శాపనార్థాలు చాల వున్నాయి. అయినా వి.ర.సం పుట్టింది. ఆంధ్రదేశ సాహిత్యోద్యమ చరిత్రలో అదొకఘట్టం. దానిపుట్టుక అభివృద్ధి చాలత్వరత్వరగా జరిగాయి. అది యుగస్వభావం. అయితే దాని పతనానికికూడ బీజాలు అప్పుడేపడ్డాయి. వి.ర.సం. రెండవ మహాసభలే అందుకు తార్కాణం. వి.ర.సం. పతనానికి బీజాలు పడ్డాయనుకోడంలో బలరామ మూర్తిగారి అవగాహన వేరు నా అవగాహన వేరు. అంతేకాదు పూర్తిగా పరస్పర విరుద్ధమైనవి. యే విప్లవలక్ష్యంతో అ.ర.సాకి కాలం చెల్లిందని వి.ర.సం. యేర్ప రచబడిందో ఆలక్ష్యమే దుందుడుకువాదం కనుక అది తప్పకుండా పతనమయిపోతుం

దనీ. ఆ పతనానికి బీజాలు దాని ఆరంభానికి కారణమయిన విప్లవధోరణిలోనే వున్నాయని బలరామమూర్తిగారి భావం.

దేశంలో నలుమూలలా చెలరేగుతున్న విప్లవ జ్వాలలతో రేకెత్తిన ఉత్తేజం వి ర సం ఆవిర్భానికి కారణమయినా నేటి యుగస్వభావాన్ని అర్థంచేసికోవడానికీ రష్యా చైనా, విప్లవాల అనుభవంతో భారతదేశ విప్లవం తీసికొనే నిర్దుష్టమయిన మార్గాన్ని ఆచరణతో జోడించి పరిశోధించడానికీఅంటే మార్క్సిజం, లెనినిజం, మావోఆలోచనా విధానం భారత దేశపు నిర్దిష్టపరిస్థితులకు అనువర్తించడానికీ పూనుకోకపోతే వి ర సం తన లక్ష్యాన్ని కోల్పోయి తిరిగి అ ర సం స్థాయికే దిగజారడం ఖాయం మొదటి మహాసభ విప్లవ శంఖారావాన్ని పూరిస్తే రెండవమహాసభ విప్లవరచయితకు "విప్లవనిబద్ధతవుందిగాని విప్లవ నిమగ్నతలేదు" "మేము విప్లవవ్యాఖ్యాతలంగాని, విప్లవకారులం కాదు"వగైరా వగైరా అప్రతిష్ఠాకరమయిన సిద్ధాంతాలతో విప్లవరచయితకు సరిహద్దులు గీయడంతో ముగిసింది. వి ర సం పతనానికి అప్పుడే బీజాలు పడ్డాయని నేనుభావించడానికి కారణం ఇది అందువల్లనే. యీ విషయంలో బలరామమూర్తిగారి భావానికి నా భావం పూర్తి వ్యతిరేకమని ముందుగానే చెప్పాను. నా భావాన్ని అనుసరించి వి ర సం నాయకులు పరిస్థితులకు తగినట్లు తన విప్లవదృక్పథాన్ని పదునుపెట్టుకున్నా, లేకవారిని తోసివేసి యువరచయితలు ముందుకువచ్చినా వి ర సం ఆవిర్భానికి మూలకారణమైన విప్లవ కర్తవ్యం జయప్రదం అవుతుంది. కాని బలరామమూర్తిగారి భావం ప్రకారం దాని పుట్టుకే దుందుడుకువాదంపై ఆధారపడింది కనుక అది తప్పక అనతికాలలోనే పతనమయితీరాలి. యేది నిజమవుతుందో చరిత్రయే తీర్పుచెప్పాలి.

కుటుంబరావుగారి గ్రంథంలో మరికొన్ని నాకుఅర్థంకాని సూత్రీకరణలున్నాయి. ఉదాహరణకు వారు శ్రీకాకుళం నక్సల్‌బరీ పోరాటాలనుగూర్చి చెపుతూ "ఇవి తిరుగుబాటులేకాని విప్లవాలుకావు"అన్నారు. వారి దృష్టిలో విప్లవం యేమిటి? తిరుగుబాటు అంటే యేమిటి? దేశం అంతా ఒకేసారి కదిల్తే విప్లవం అనీ, కానిది తిరుగుబాటు అనా? సాయుధసైన్యం ప్రజలకుకూడ యేర్పడినతరువాతనే విప్లవమవుతుందనీ, అంతకుముందు ఘర్షణలన్నీ తిరుగుబాట్లవుతాయనా? వారి దృష్టియేమిటో స్పష్టంగాచెప్పాలి ఎందుకంటే విప్లవం అంటే యేమిటి? భారత దేశంలో జరుగుతున్న విప్లవం యొక్క రూపురేఖలు యెలావుండాలి? అనేవిషయంలో విప్లవకారులమధ్య తీవ్రమయిన వాదోపవాదాలు జరుగుతున్న ఈ సమయంలో కుటుంబరావుగారు పై సిద్ధాంతీకరణ చేయడానికి చాల ప్రాముఖ్యతవుంది. అందువల్ల వాదాన్ని విపులీకరించాల్సిన బాధ్యత వారిపై వుంది. తప్పకుండా విపులీకరిస్తారని ఆశిస్తాను.

కె. ప్రభాకర్‌రెడ్డి.

సమీక్ష :

# "ఘాటెక్కిన గంధక ధూమం"

"ఈరాణీ ప్రేమ పురాణం
ఆ ముట్టడికైన ఖర్చులూ
మతలబులూ కైఫీయతులూ
ఇవి కావోయి చరిత్రసారం"

అని ఈసడిస్తూ ప్రజల చరిత్రను నిర్వచించాడు మహాకవి శ్రీశ్రీ. మనకు మంచి నవలలు తక్కువ అందులోనూ జరిగిన, జరుగుతున్న చరిత్రను చిత్రించే నవలలు ఇంకా తక్కువ. 1937-40 నాటి తెలంగాణా గ్రామీణ జీవితాన్ని "చిల్లర దేవుళ్ళు" నవలలో చిత్రించిన శ్రీ దాశరథి రంగాచార్య "మోదుగు పూలు" లో 1943-48 నాటి జాగీర్దారీ జీవితాన్ని, ప్రజల చైతన్యాన్ని చిత్రించారు.

తెలంగాణా ! ఆపేరులోనే అనేక స్మృతులు సమస్యలు పెనవేసుకొని ఉన్నాయి. తెలంగాణా "ఎన్నడూ" అధికారికంగా ఒక ప్రత్యేక రాజకీయవిభాగం కాదు. అయినప్పటికీ తెలంగాణా కాక 'ప్రత్యేకత' "ఎప్పుడూ" ఉంటూనే వచ్చింది. అలనాడు రామదాసు భద్రాచలమందిర నిర్మాణంతో తానీషా ప్రభువుకొక సమస్య తెచ్చిపెట్టాడు. గుర్రాల గోపిరెడ్డి తిరుగుబాటు చేసాడు. 1945-50 సంవత్సరాలలో జరిగిన తెలంగాణా పోరాటం ఆరుద్ర, సోమసుందర్, గంగినేని మొదలైన తెలుగు కవులకేకాక ఈ సంవత్సరపు నోబెల్ బహుమానగ్రహీత పాబ్లోనెరూడా (చిలీ) లాంటి అంతర్జాతీయ కవులనుకూడ ఉత్తేజపరిచింది. 1956 లో ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి ముందు తెలంగాణా ఫజులాలీ కమీషన్‌కొక పజిల్. మళ్ళీ ఇటీవలి ప్రత్యేక తెలంగాణా పోరాటం మరో సమస్య.... చరిత్ర పొడవునా తెలంగాణా సమస్యగానే ఉంటూవచ్చింది.

కాని తెలంగాణా ప్రజా జీవితాన్ని చిత్రించే నవలలు, కథలుమాత్రం చాల తక్కువ వెలువడ్డాయి. వాటిలో కొన్ని తెలంగాణా మాండలికాన్ని మాత్రమే స్వీకరించాయి. తెలంగాణాలోని జీవపదార్థాన్ని స్పృశించ లేకపోయాయి. బొల్లిముంత, గంగినేని వెంకటేశ్వరరావు మొదలైనవారు తెలంగాణా జీవితాన్ని చిత్రించడానికి నిజాయితీ, సానుభూతి, ఆవేశం కనబరచగలిగారు. కాని ఇక్కడి పరిస్థితులను సమగ్రంగా చిత్రించలేకపోయారు. వట్టికోట ఆళ్వార్‌స్వామి "ప్రజల మనిషి" "గంగు"

రచనలలో నిజాం ప్రభుత్వంలోని తెలంగాణా జీవితానికి అద్దం పట్టాడు. ఆ ఉద్యమం ఇంకా కొనసాగాలి.

శ్రీ దాశరథి రంగాచార్యగారి "చిల్లర దేవుళ్ళు" "మోదుగు పూలు" పరిశీలిస్తే ప్రణాళికాబద్ధంగా తెలంగాణా చరిత్రను నవలలుగా మలచే ప్రయత్నం కనబడుతుంది. "చిల్లర దేవుళ్ళు" రంగస్థలం "ఖాల్సా"లోని గ్రామం ("ఖాల్సా" అంటే నిజాంవారి ప్రభుత్వం ప్రత్యక్షంగా చెలామణిలో ఉండే ప్రాంతం) జరిగిన కాలం 1937 - 40. అక్కడి అధికారులే (దేశముఖ్, పట్వారీలు) చిల్లర దేవుళ్ళు. "మోదుగు పూలు" రంగస్థలం జాగీర్దారీ గ్రామం. అంటే ఇక్కడ నిజాంవారి అధికారం ప్రత్యక్షంగా ఉండదు. ఇక్కడి అధికారమంతా జాగీర్దారుది. నిజాంవారికి నజరానాలు, పన్నులు సమర్పించుకుని ఆ అధికారాన్ని గుత్తకు తీసుకున్నాడు జాగీర్దారు. నిజానికితనదీ ప్రత్యక్షాధికారం కాదు. అతని ఏజెంటు తాసిల్దారుది. జరిగిన కాలం 1943 - 48 సంవత్సరాల మధ్య.

జాగిర్దారుకు జల్సాగా జీవించడం, నిజాంవారికి పన్నుకట్టడం మినహా వేరే బాధ్యతలేవీ లేవు. యూరపు ఖండంలోను, మధ్యప్రాచ్యంలోను మధ్యయుగాలనాటి విలాసజీవితం, అక్కడి ప్రజల నికృష్టపరిస్థితులను గురించి అనేక గ్రంథాలు వెలువడ్డాయి. మన తెలంగాణా జాగీర్దారీగ్రామాల చరిత్రను పైకితీస్తే ఇక్కడి కథలకూ ఆ మధ్యయుగాల వర్ణనకూ తేడాలకంటె పోలికలే ఎక్కువ. గ్రామ ప్రజలందరికీ సమానమైన దారిద్ర్యం, బాధలు ఉండేవి. సుఖాలు సంపదమాత్రం, అమీన్ (సబిన్ స్పెక్టరు), తాసిల్దార్, జాగిర్దారులకు తరతమభేదాలతో దక్కేవి. అంటే "మహాఘనత వహించిన" నిజాంవారి ఏలుబడిలో "ఘనత వహించిన" జాగిర్దార్ గ్రామంలో "ఘనుడైన"తాసిల్దారుది ఇష్టారాజ్యం. జంతువుల ఆలోచనకూ, ఆచరణకూ మధ్యకాలవ్యవధి ఉండదు. అలాగే నిరంకుశపాలకులకు కూడా. వలచిన తక్షణం చెరచటం, తలచిన వెంటనే "ఆ"చరించటం

ఈ నవలలో కథాప్రారంభం 1943 ప్రాంతాలలో, కథాంతం 1948 నాటి పోలీసుచర్య. ఈ మధ్యకాలంలో మంగళ్లు మొదలుకొని కోయలవరకూ ఉన్న పీడిత లోకం మేల్కొని ఒళ్లు విరుచుకుని ఒక్కపెట్టున పీడకులపై దండెత్తుతారు.... అవును వారు విప్లవిస్తారు, అంతకుమునుపు వారు ఆరుగాలం వళ్లు విరుచుకుని బ్రతకడమే వారి జీవితం, వృత్తి, ధర్మం, మతం వగైరా అన్నీ. వారే విప్లవిస్తే

"గొడ్డలి లేచింది
పార లేచింది
గునపం లేచింది
.... .... .... ...."

ఈదశకు రావడానికి ముందున్న విప్లవదశలనన్నింటినీ ఈ నవలలో గ్రాఫిక్‌గా చూడవచ్చును. సాంఘిక దురన్యాయాలకు వ్యతిరేకంగా ప్రారంభమౌతుంది విప్లవోద్యమం. తర్వాత ఆర్థిక బానిసత్వంపై వ్యతిరేకపోరాటం. దానితర్వాత మొత్తంవ్యవస్థపైన సాయుధ విప్లవంగా ఈ పోరాటం పరిణతి చెందుతుంది.

ఏది హింస? ఏది ప్రతిహింస? అనేసమస్యను ఈనవల చక్కగా ఆవిష్కరించింది. అహింసాయుత విప్లవమనే విరోధభావాన్ని యీ నవల తునాతునకలుచేసింది. "ఎవరు నేర్పారు మీకీతిరుగుబాటు?" అనే ప్రశ్నకు సూటిసమాధానం "మాపొట్ట... మాఆకలి".

---

మొదుగుపూలు
రచన: దాశరథి రంగాచార్య
వెల: రూ. 5-50
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ.

---

ఆలోచనాపరుడైన నాయకుడు రఘు ఆవేశపరుడైన నాయకుడు నగేశ్. ఉదారవంతుడైన మధ్యతరగతి రైతు వీరయ్యగారు. పోరాటంలో తన పాత్రను నిర్వహించడానికి సతమతమయ్యే జానకి.... ఏమీ ఎరుగని పేరియసి.... ఇలా అనేకపాత్రలను వర్ణించిందానవల.

నవలాసాహిత్యంలో "పిరియడ్ నావెల్సు"అనేవిభాగం ఉన్నట్టు పేర్కొంటారు. వాల్టర్‌స్కాట్ "వేవర్లా"నవలలు ఆజాతికిచెందినవే. సాటిష్‌చరిత్రలోని ఉజ్వలఘట్టాలను నవలలుగా రచించాడాయన. "చిల్లరదేవుళ్లు" "మోదుగుపూలు" నవలలు ఇటీవల చరిత్రకు సంబంధించినవైనా, వాటిని "పిరియడ్ నావెల్సు"గా పేర్కొనాలి. విప్లవోద్యమ చరిత్రకు యిలాంటివి అవసరము.

"మోదుగుపూలకు సువాసనవచ్చిందని" శ్రీతిరుమల రామచంద్రి తమపరిచయములో వ్రాశారు. మోదుగుపూలు గిరిజనులకు సింబల్. చెట్టునిండా మోదుగులు విరియబూశినప్పుడు చూస్తే ఒక ఆకుకూడ ఉండదు. చెట్టంతా కీలల్లాగా జ్వాలల్లాగా కనబడుతుంది. అందుకే అవి పూలుకావు. కీలలు, మంటలు.... జ్వాలలు. వానికి వచ్చింది సువాసనకాదు అది "ఘూటెక్కిన గంధక ధూమం" ఆకీలలూ, ధూమమూ జగమంతా వ్యాపించాలి, వ్యాపిస్తాయి.

—రహీ

ఆలోచనాపత్రం—2

## తనకోడే కూయాలని......

నేడు ప్రజాపాలన జరుగుతున్నది, నీవేమిటి నేనేమిటి— బిచ్చగాడు, దగాకోరు దరిద్రుడు, జేబుదొంగ— అందరూ రాజులే, పడుపుగత్తె మాలిపిల్ల, పాలులేని కన్నతల్లి— మగువలందరును మహారాణులు, గజ్జిపట్టిన పిల్లవాడు వీధిమొత్తన విస్తరాకు మందుటెండలో కన్నుమూసిన నయాపైస నారాయణ— భారతావని రాకుమారులు, జయము జయము పంచశీలా! శాంతి- శాంతి అశోకచక్రమా!

ఈ పొడిమాటలు ఎందుకు చెప్పవలసివచ్చిందంటే పూర్వం (1958 లో) పిఠాపురంలో శృంగారాభ్యుదయకవి శ్రీ సి. నా. రె. మాట్లాడుతూ ఇవి ఉద్యమాల రోజులు కావు ఉద్యమోత్కంఠిపమైన కావ్యాలకు నేడు విలువలేదు కనుకనే దాశరథి, సోమసుందర్, అనిశెట్టి, శ్రీ శ్రీ వంటి కవుల ఆవేశపు బొబ్బలకు నేడు స్థానంలేదు. అని సెలవిచ్చారు ఆనాడు.

ఈనాడు కొత్తరంగు కోడిపుంజు అని కోడిని వెక్కిరిస్తున్నాడు. నిద్రపోయిన జాతిని, నల్లమందు మత్తుతో, అజ్ఞానం అంధకారంలో పడివున్నజాతిని లేపవద్దని వారి నిద్ర పాడుచెయ్యవద్దని గోల చేస్తున్నాడు ఈనాడు.

ఒకప్పుడు నీవు సృజించిన చరణాలే మళ్ళ మళ్ళ నా నాచరమ గీతంగా అట్టడుగునపడి పుచ్చిపోయిన నీ ఆత్మకు అందిస్తున్నాం అందుకోమళ్ళ

"చెదలుతిన్న హృదయంతో / నుసిపట్టిన మనస్సుతో
మాటలు గిలికేవాడు / ఏనాటికి కవిగాడు!"
"ఔను నిజం / ఔను నిజం
నీవన్నది నీవన్నది / నిజం నిజం ఔనునిజం

"మ న సా హి తి"
విశాఖపట్నం.

సాహిత్య లేఖలు:

## బంగ్లాదేశ్ - ఇండియా - చైనా

బంగ్లాదేశ్ విషయంలో మేధావులందరు చైనామార్గాన్ని ద్వేషిస్తూ విమర్శిస్తున్నారు. విప్లవ సిద్ధాంతకర్తగా మావోను నమ్మి, మెచ్చినవారు ఈ విషయంలో అలా మారిపోవటం ఖచ్చితమైన అవగాహన చేసుకోలేకపోయారేమో అనిపిస్తుంది. రేడియో పేకింగ్ భారత్‌కు చేసిన హెచ్చరికలు ఎందుకు నిలుపుకోలేకపోయింది? యుద్ధవిషయంలో పాకిస్థాన్‌కు వారుపెట్టిన షరతులేమి? ఆ షరతులకు పాక్‌పాలకులు ఒప్పుకోక బంగ్లాను ఎందుకు విడిచిపుచ్చినారు? ఈమూడు ప్రశ్నలు వారు వేసుకొని ఉంటే అసలు విషయం బోధపడక మానదు.

"బంగ్లాదేశ్ పోరాటానికి ప్రస్తుతం నాయకత్వం వహిస్తున్నది బూర్జువా—భూస్వామ్యవర్గాలే అయినా బంగ్లాదేశ్ ప్రజల విమోచన పోరాటానికి ఈ పోరాట విజయం దోహదపడుతుంది. ఈ పరిస్థితిని విస్మరించటమంటే కార్మికవర్గపార్టీ తన అంతర్జాతీయ కర్తవ్యాన్ని విస్మరించుటమే అవుతుంది" (చూ. ప్రజాశక్తి 14-8-71)గా సమర్థించుకున్నారేమో. అయినా యీ విషయంలో మనం కలుగజేసుకోవటం దోపిడి దారులకు తోడ్పడినట్లు అవుతుందని నావిశ్వాసం.

వసు

గుంటూరు.

## సామ్యం- ఎంతవరకు సమంజసం?

రావిశాస్త్రిగారు వీట్నాం విషయం ఐక్యరాజ్య సమితిలో తీర్మానం తేనందుకు చైనాను తప్పుపట్టారు. వీట్నాం విషయంలో చైనా నిర్వహిస్తున్న పాత్రి యేమిటో చైనాను అడగకపోతేమానె, స్వయంగా వీట్నాంను. అటు అమెరికాను అడగండి. మరి అదేవిషయంలో ఇండియా ఏంచేసింది? ఇండియా ఎందుకుతేలేదు. యుఎన్‌ఓ లో తీర్మానం, ఇవ్వాటిదాకా దక్షిణవీట్నాం విప్లవప్రభుత్వాన్నికూడ గుర్తించని ఇండియా. వీట్నాంలో అమెరికా అమానుషచర్యలపట్ల ఉదాసీనత వహించిన ఇండియా, ఇటు దేశంలో కేరళ, బెంగాల్‌లలో ఎన్నోమార్లు ప్రజాస్వామికంగా ఏర్పడిన ప్రభుత్వాలను కూలదోసిన ఇండియా బంగ్లాదేశ్‌లో ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికే మిల్టరీ చర్య తీసుకున్నదని నమ్మడం అమాయకత్వం. నమ్మించ ప్రయత్నంచేయడంమాత్రం

బద్మాషీ. నాగా. మిజోలకు చైనా ఏ రూపంలో ఎంతమాత్రం సహాయంచేస్తున్నదో భారతప్రభుత్వానికన్న రావిశాస్త్రిగారికే ఎక్కువ తెలిసినట్లున్నది.

'విప్లవాలు ఎగుమతిచేయబడవు' అన్నది చైనాకు తెలుసు. భారతప్రభుత్వానికి కూడ తెలుసు! తెలుసుకోవలసిందల్లా రావిశాస్త్రిగారివంటి మేధావులు.

రామనారాయణ,
ఖర్గపూర్.

## రచయితల ప్రొటెస్ట్

తహసీల్ బటాలా (పంజాబ్) లో ఇద్దరు కళాశాల విద్యార్థులను అరెస్ట్‌చేసి ఎంతోమంది ప్రజల కళ్ళముందర కాల్చివేసారు. వాళ్ళు నక్సలైట్లుగా అనుమానించబడ్డారు అంతేకాని ఏ కోర్టులోనూ విచారణ జరుగలేదు. అన్ని రాజకీయపార్టీలు విద్యార్థులు. ట్రేడ్ యూనియన్ నాయకులు న్యాయవిచారణ జరపాలని డిమాండ్ చేసారు కాని ప్రభుత్వం మౌనం వహించింది.

ఇంకో సంఘటన తహసీల్ బార్నాలాలో పోలీసులు మొత్తం ఒక గ్రామానికి గ్రామాన్నే హింసించారు. స్త్రీలపై క్రూరమైన నేరాలు చేసారు. ఆస్తులు. పంటలు నాశనం చేసారు. ఇదంతా ఒక నక్సలైట్ అనబడేవాణ్ణి అరెస్ట్ చేయడానికి జరిగింది.

పంజాబ్ పోలీస్ మేధావులను– యునివర్సిటీ టీచర్లను, రచయితలను ఇంటరాగేట్ చేస్తుంది. వాళ్ల ఇళ్ళు సోదాచేస్తుంది. వాళ్ళ వస్తువులు పట్టుకపోతుంది. దానికి ఉచిత మనిపించిన బాధలన్నీ పెడుతుంది. ఎంతోమంది రచయితలు ఉపాధ్యాయులు, విద్యార్థులు, ట్రేడ్ యూనియన్ నాయకులు తప్పుడు కేసుల్లో ఇరికించబడ్డారు.

31 అక్టోబర్ రోజు 500 నుండి పంజాబీ రచయితలు పోలీసుల అత్యాచారాలకు వ్యతిరేకంగా జలంధర్‌లో ఒక ఊరేగింపు తీసారు. బూర్జువా ప్రెస్ ఇది ప్రచురణార్హమైన విషయంగా భావించలేదు.

ఎస్. ఎస్. దుసాజ్
ఆర్గనైజింగ్ సెక్రెటరీ
కేంద్రీ పంజాబీలేఖక్ సభ
జలంధర్

## ప్రత్యేక తెలంగాణా, స్వతంత్ర బంగ్లాదేశ్-మార్క్సిజం

సృజన జనవరి సంచికలోని ఆర్. జి. ఆర్. సాహిత్యలేఖ.

మతం అనేది ఐక్యతకు ఒక ప్రాతిపదికగా మార్క్సిజం చెప్పదు. అందులో వెయ్యిమైళ్ళ పైగా దూరానవుండి ఒక్కమతం విషయంలో తప్ప యింకే సామ్యంలేని పశ్చిమ పాకిస్తాను నుండి బంగ్లాదేశ్ విడిపోవటం, దాన్ని బలపర్చటం పూర్తిగా సరియైనదే. కాని మార్క్సిజం చెపుతున్న ప్రాదేశిక సమైక్యత, ఒకేభాష, సంస్కృతి చరిత్రగల జాతి సిద్ధాంత ఆధారంగా తెలుగుదేశం అంతా ఒకే రాష్ట్రంగా వుండాలని ఒక మార్క్సిష్టు అన్నా. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ప్రత్యేక తెలంగాణా వుద్యమం వచ్చినపుడు దాన్ని బలపర్చాలని ఇంకో మార్క్సిష్టు అన్నా అది చర్చించి సరియైన అవగాహనకు, నిర్ణయానికి రావలసివుంటుంది. అంతేకాని యీసందర్భంలో బంగ్లాదేశ్ సామ్యం తీసుకురావటం అసందర్భం అవుతుంది. రెంటిలోనూ సారూప్యతకన్న విరూపతే ఎక్కువ. రెండు వుద్యమాల పరిమాణంలోను గుణాత్మక స్థాయిలోను తేడా కూడ ఎక్కువే. అందువలన ప్రత్యేక తెలంగాణా వుద్యమాన్ని భిన్నంగానే పరిశీలించ వలసి వుంటుంది. యీ వుద్యమానికి దారితీసిన సంఘటనలు, ఉద్యమలక్ష్యం, నాయకత్వం ప్రజల in volvement మార్క్సిష్టు ఉద్యమలక్ష్యం దృష్ట్యా దానిసరియోజనం అవగాహన చేసుకోవాలి.

ఒక పోరాటం సరియైనదై ఉద్యమ నాయకత్వ లోపంవల్లగాని, యితరలోపాల వల్లగాని విఫలమైనపుడు దాన్ని బలపర్చిన మేధావులుగాని మార్క్సిష్టులుగాని ఏమి చేసి వుండవలసింది ? చేతులు ముడుచుకు కూర్చోవలసిందేనా ? వుద్యమ సందర్భం లోనే దానిలోపాలు, బలహీనతలు స్పష్టంగా కనపడుతున్నపుడు ఆలోపాల్ని తొలగించ టానికి క్రియాశీలకమైన పాత్ర నిర్వహించి వుండవలసింది గాదా ?

నాదృష్టిలో నాకున్న మార్క్సిష్టు అవగాహన మేరకు రెండు బెంగాలులు ఏకం కావాలన్నా, రెండు తెలుగు ప్రాంతాలు యిప్పుడు ఏర్పడి ముందు మళ్ళీ యింకోసారి రెండూ ఏకం కావాలనే పరిస్థితి ఏర్పడినదన్నా తప్పుకాదు. కాని ఆయా సందర్భాలలో ఉద్యమ అంతిమలక్ష్యం దృష్ట్యా పరిస్థితుల్ని సమగ్రంగా పరిశీలించి నిర్ణయించుకోవలసి వుంటుంది. ఆలాంటి పరిశీలనతో విషయ వివరణలేకుండా ఒకరిని యింకొకరు అన్‌మార్క్సియన్ అనటం తొందరపాటు, అనుచితమూను. అటువంటి వివరణచర్చ జరిగితే మంచిది.

చెరుకూరి కాశీవిశ్వనాథం
హన్మకొండ

ప్రజాకవి ప్రాణవాయువులు

ప్రజలకోసంవీచి, కెరటంలాలేచి పాటలుగామారి

ప్రజలకోసం భూమిమీద రక్తాంకితమైనవి.

సుబ్బారావు పాణిగ్రాహి పాటలు గాలిని, నేలను,

ఆలోచనలను ఎరుపెక్కించాయి.

# ఎరుపు

సుబ్బారావు పాణిగ్రాహి పాటలు




విప్లవ రచయితల సంఘం ప్రచురణ

పాణిగ్రాహి ముఖచిత్రం, పాణిగ్రాహి సంక్షిప్త జీవిత చరిత్ర.

పాణిగ్రాహి జముకులకథ దళం ఫోటో ప్రత్యేక ఆకర్షణలు.

వెల: ఒక రూపాయి

ప్రతులకు: చెరబండరాజు

2-2-359. అంబర్‌పేట, హైదరాబాదు-13

చంద్రుడివేపు వేలు చూపిస్తే వేలువేపు చూస్తాడు మూర్ఖుడు

—చైనీస్ సామెత

ఒకవీరుడిచేతిలో కాగడా, వాణ్ణి చంపి కిందపడేస్తే దాన్ని మళ్లీ ధరించడానికి వందల సంఖ్యలో వేల సంఖ్యలో చేతులు లేస్తాయి. ఈ చేతులకి నా స్వాగతం— అంటున్న

శ్రీ శ్రీ

అనువాదం

రెక్కవిప్పిన రివల్యూషన్

(మూలం: ఏంజెలోకాటోచ్చి)

నిన్నగాక మొన్న ఫ్రాన్స్‌లో తాత్కాలికంగా ఓడిపోయి శాశ్వత విజయాన్ని ప్రామిస్ చేసిన ఫ్రెంచ్ విప్లవగాథ.

ప్రచురణ ఉద్యమసాహితి, కరీంనగర్.

ప్రతులకు సృజన హనుమకొండ, వరంగల్-1.

వెల 2 రూపాయలు

నవకాయరుచులకు పెట్టింది పేరు

హోటల్ విజయగార్డెన్స్

మెయిన్ రోడ్

విశాఖపట్నం

